మూగవోయిన కోటితమ్ముల గళాల
పాట పలికించి కవితాజవమ్ముకూర్చి
నా కలానకు బలమిచ్చి నడిపినట్టి
నా తెలంగాణ కోటి రతనాల వీణ

-----దాశరథి

ప్రాంతేతరుడే దోపిడి చేస్తే
పొలిమేర దాకా తన్ని తరుముతం
ప్రాంతం వాడే దోపిడి చేస్తే
ప్రాణం తోటే పాతర వెడతం

------ కాళోజి

వరుణదేవా,నువ్వు కురియ బోకయ్య
రైతన్న నువ్వు భూమి దున్న బోకన్న
చూతాము ఈ రాజు లెట్లేలుతారో
చూతాము ఈ రాజు లేమి తింటారో

-----పొట్లపల్లి రామారావు

# కదం కదం



## తెలంగాణ ఉద్యమ కవితలు

# కదం కదం

(తెలంగాణ ఉద్యమ కవితలు)




సంకలన కర్తలు :

**శ్రీ వంగా గాలిరెడ్డి**

**శ్రీ డబ్బీకార్ సురేందర్**



**మైత్రి మిత్ర మండలి**

సిద్ధిపేట వారి ప్రచురణలు

2011

**KADAM KADAM**

*(Telangana Udyama Kavithalu)*
***1st Book***

ప్రథమ ముద్రణ : 2011 జూలై

ప్రతి వెల : 50-00

ముఖ పత్ర చిత్ర రచన : సుప్రసిద్ధ శిల్పి, చిత్రకారులు
శ్రీ రమణారెడ్డి, హైద్రాబాద్.

ప్రతులకు : **మైత్రి మిత్రమండలి**
ఇ.నం. 19-26/1,
బ్లాక్ ఆఫీస్ ఎదురుగా,
హైద్రాబాద్ రోడ్, సిద్ధిపేట - 502 103.
**సెల్: 9391813526, 9618789598**

గ్రాఫిక్స్ : శ్రీ కమల్ గ్రాఫిక్స్, సిద్ధిపేట.
సెల్ : 9885841905

ముద్రణ : కర్షక ఆర్ట్ ప్రింటర్స్
విద్యానగర్, హైద్రాబాద్.
ఫోన్ : 040-27618261



## అంకితం

**1952, 1969 ఉద్యమాలలో నేలకొరిగిన అమరులకు,**

**ప్రస్తుత ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో**

**ఆత్మార్పణ చేసుకున్న త్యాగధనులకు కన్నీళ్లతో...**

**మైత్రి మిత్రమండలి**

**T. HARISH RAO**
M.L.A.,
SIDDIPET CONSTITUENCY - 33
MEDAK DISTRICT





తేది : 04-06-2011

## సందేశం

మానవ పరిణామ క్రమంలో మొదటి నుండి బలవంతుడు, బలహీనులను అణచడమే జరుగుచున్నది. బలహీనులు ఒక్కటై బలవంతులను ఎదుర్కొనడమే ఉద్యమం. అటువంటి ఉద్యమమే ప్రత్యేక తెలంగాణ పోరాటం. గతంలో జరిగిన అన్ని ఉద్యమాలలో మేధావులు, రైతులు, కార్మికులు, కూలీలు. స్త్రీలు, సామాన్యులు అందరు కలిసి పోరాటాలు చేసింద్రు. అందునా ప్రత్యేకించి తెలంగాణ ప్రాంతంలో నైజాంకు వ్యతిరేకంగా. రజాకార్లను అడ్డుకొని పోరాటం చేసింద్రు. ప్రాణాలకు తెగించి దాశరథి, కాళోజి వంటికవులు జైలు నిర్బంధంల ఉండికూడ సాహిత్యం ద్వారా గొప్పసేవ చేసింద్రు.

ప్రత్యేక తెలంగాణ ఉద్యమానికి కూడ కొండంత అండగా నిలబడిన కవులు చక్కని కవిత్వం రాస్తున్నరు. ప్రత్యేకించి ప్రత్యేక తెలంగాణ ఉద్యమ పురిటి గడ్డ సిద్ధిపేటలో ప్రత్యేక తెలంగాణ పోరాటం మీద "కదం కదం" అనే సంకలనాన్ని తేవడం చాలా సంతోషించదగిన విషయం. ఉద్యమానికి ప్రేరణ నిస్తున్న కవిమిత్రుల సాహిత్యకృషికి వెలకట్టలేము.

ఈ సంకలనంలోని అన్ని కవితలు తెలంగాణ ఉద్యమ స్ఫూర్తిని కలిగిస్తున్నాయి. 56 సంవత్సరాల సమైక్యాంధ్ర వలస పాలకుల క్రింద తెలంగాణ ఎన్నిబాధల్ని భరించిందో, ఎంతదోపిడికి, మోసానికి, అన్యాయానికి, ఆక్రమణకు బలిపీఠమైందో 56మంది కవుల కవితలే సాక్ష్యం.

సిద్ధిపేట స్థానిక శాసన సభ్యునిగా,ప్రత్యేక తెలంగాణ వాదిగా వారి ప్రయత్నంలో వారి వెన్నంటి ఉండి వారికి నావంతు సహాయ సహకారాలందిస్తా.

సిద్ధిపేట కవుల "కదం కదం" తెలంగాణ ఉద్యమ కవితల సంకలనానికి సందేశమివ్వడం నా భాగ్యంగా భావిస్తున్నాను.

తెలంగాణ సిద్ధించేవరకు ఇదే స్ఫూర్తితో అందరం కలిసి పోరాటం చేద్దాం, తెలంగాణ సాధించుకుందాం, జై తెలంగాణ! జైజై తెలంగాణ!!

అభినందనలతో...

తన్నీరు హరీష్‌రావు
సిద్ధిపేట గౌరవశాసనసభ్యులు

# INDEX

## INDEX



ఉద్యమాక్షర ఉత్తేజం

# సిద్ధిపేట కవుల జీవాక్షరాలు




డా॥ నందిని సిదారెడ్డి
సెల్ : 9440381148


తెలంగాణ రాష్ట్రం కోసం ఉన్నతమైన ప్రజా ఉద్యమం ఉవ్వెత్తున ఎగసిపడుతున్నది. ఆ హోరును అక్షరాల్లో ఒడిసి పడుతున్నరు తెలంగాణ కవులు. జీవితానుభవాన్ని శాశ్వతం చేసే మనోహరమైన కళ కవిత్వం. సమాజ జీవితంలోని సమస్యల్ని, సంఘర్షణల్ని, సంక్షోభాల్ని చిత్రించుకుంటూనే వాటి పరిష్కారం కోసం ప్రజల్ని సమాయత్తం చేస్తరు కవులు. తెలంగాణ యాభైఅయిదు సంవత్సరాలుగా యాతన పడుతున్నది. అనేక అవమానాలతోటి అంతుచిక్కని రకరకాల దోపిడీ, అణచివేతల తోటి, అస్తిత్వాన్నే రద్దుచేసే అసంబద్ధ కువారాల కుట్రల తోటి నిరంతర యుద్ధం చేస్తున్నది. తెలంగాణ తల్లి కంట నీరు ధారగా మట్టి గుండెలను తడుపుతనే ఉన్నది. ప్రజలు ప్రాణ త్యాగాలకు సిద్ధమై చరిత్రను మలుపు తిప్పుతున్న సందర్భం సహజంగానే కవుల్ని భావోద్వేగ భరితులను చేస్తుంది. కవి సమయాలు, కవిధర్మాలు తెలంగాణ ఉద్యమ చైతన్యాన్ని పాటలతో, కవితలతో, పద్యాలతో అడుగు అడుగు ఉడుకెత్తిస్తున్నయి.

ప్రత్యేక తెలంగాణ ఉద్యమాల బాటలో సిద్ధిపేట ఒక చరిత్ర, ఒక అధ్యాయం. తొలిదశ ఆరవై తొమ్మిది ఉద్యమంలో తొలి ఉప ఎన్నికలో ఘన విజయం ఇచ్చింది సిద్ధిపేట. మలిదశ తొంభైఆరు ఉద్యమంలో నాలుగు ఉప ఎన్నికల్లో అద్భుత విజయాలు కూర్చింది సిద్ధిపేట. రాజకీయ, సాంస్కృతిక, సాహిత్య నాయకత్వాన్ని తెలంగాణకు అందించిన గడ్డ ఉద్యమాల అడ్డ సిద్ధిపేట.

ఏడాదిన్నర కాలంగా రిలే నిరాహార దీక్షాశిబిరం నిరాటంకంగా కొనసాగుతున్నది. దీక్షా శిబిరానికి సంవత్సరం నిండిన సందర్భంగా కవి సమ్మేళనం నిర్వహించింది. 520 రోజులు పూర్తయిన నేపథ్యంలో స్థానిక కవుల సంకలనం వెలువరిస్తున్నది. సిద్ధిపేట పట్టణం తెలంగాణ సాంస్కృతిక కేంద్రం. చిత్రాలకు, సంగీతానికి, నాట్యానికి, సాహిత్యానికి, సంస్కృతీ వైవిధ్యానికి నిలయం. ఇంతవరకు

తెలుగు చరిత్రలు ఆంధ్ర ప్రాంతపు పట్టణాల్ని సాంస్కృతిక కేంద్రాలుగా ప్రచారం చేసినయి. ఇప్పుడు తెలంగాణ పట్టణాల ప్రత్యేకతలు, కళావైభవాలు ఉట్టిపడేలా మనం చరిత్రలు రాయవలసిన ఆవశ్యకతను తెలంగాణ దృక్పథం ముందుకు తెచ్చింది. అట్లా అన్ని రకాలుగా ఈ కవితా సంకలనానికి ప్రత్యేకత, ప్రాధాన్యత ఉన్నది.

తెలంగాణ ఉద్యమ దశలన్నింటిని చిత్రించే 56 మంది కవుల సమాహారమిది. సంకలనంలో ఐతా చంద్రయ్యలాంటి లబ్ధ ప్రతిష్టులు, ఉంద్రాళ్ళ రాజేశం వంటి యువకవులు కవితలు రచించిండ్రు. దీక్షా శిబిరాన్ని దక్షతతో బాధ్యతలు చూస్తున్న వంగా గాలిరెడ్డి వంటి వయోవృద్ధులతో పాటు డబ్బీకార్ సురేందర్ వంటి యువకులు కవిత్వం సృజించిండ్రు.

"చౌడునేల దేహానికి తుమ్మపూల చీరకట్టి చెలకబొట్టు పెట్టిన తెలంగాణ"ను కందుకూరి శ్రీరాములు చిత్రిస్తే... "భాషపేర తెలంగాణకు బాధల హారం వేసిరి" అంటడు ఐత చంద్రయ్య. "కలిసిఉంటే కష్టాల పాలయిందెవరో, సుఖాలు దక్కిందెవరికో సమైక్య రాగంలో సమానత్వమెంతో" భగవాన్‌రెడ్డి వివరిస్తున్నడు. 'పట్టిపోయిన బతుకును నోటికందని మెతుకును" మహమూద్ పాషా చిత్రించిండు. "మనకు 54 శిశిరాలు, వాళ్ళకు 108 వసంతాలు" అని కె.అంజయ్య విశ్లేషించిరి. "ఎనగుర్తిని ఎలిసిపోయిన బట్టగా మలిచెందెవరో" బోరెడ్డి మధుసూధన్ రెడ్డి గుర్తించిండు. "మా చేనేత చెయ్యి నరికి చందన బొమ్మలు కట్టి"న సీమాంధ్రుల పాలకుల్ని సార సురేష్ నిలదీస్తున్నడు. "ఇత్తులు పండవలసిన నేల నెత్తురోడుతున్న" నేపథ్యం రైతును అప్పుల ముండ్ల కిరీటాన్ని ధరించిన కలియుగ యేసు" గా దర్శిస్తున్నడు రాయిని రాజిరెడ్డి. "జై బోలో తెలంగాణ, తొలకరిలో రైతుకోసం భూమాత గుండె పొరల్నుండి ఉబికివచ్చిన ఆరుద్ర పువ్వుగా తెలంగాణ ఉద్యమ చిత్రాన్ని వర్ణిస్తున్నడు వంగా గాలిరెడ్డి. "సాగిద్దాం-పోరాటం-అందరి పోరాటం-మనమంతా ఒక్కటైతే రాదెందుకు తెలంగాణ" అంటూ పిలుస్తున్నడు కె.వై. గిరి. "మాకొద్దీ ఆంధ్రా పెత్తనం" నినదిస్తున్నడు ఎన్.రాములు. "తల్లి ఏం కలగన్నది. బిడ్డలెవరి కండ్లల్లో కన్నీరు చూడనంది కండ్లల్లో వెయ్యి సూర్యుళ్ళు" అలాజిపూర్ కిషన్ ఆహ్వానిస్తున్నాడు. "ఊరు పల్లెలు వాడలు ఒక్కటేమి పట్టణాలు తండాలల్ల బతుకు ప్రజలు" అందరు ఉద్యమించిన తీరు బొద్దుల పుండరీకం వర్ణించిండు. "ఊసుకండ్లోనికి



పాసుపండ్లోడు అన్నట్టు చిదంబరానికి శ్రీకృష్ణ తోడు. ఆడితప్పిండు ఒక్కడు. అన్నీ తెలిసి ముంచిండు ఒక్కడు" డబ్బీకార్ సురేందర్ కమిటీల కంత్రీ తనాన్ని బయటపెట్టిండు. "నిలువెత్తు ఆశను నాటకాలు కాల్చేస్తాయి. ధైర్యానికి కపటపు ఉరితాళ్ళు బిగుస్తాయి" అని తోట అశోక్. "ఇవి ఆంధ్ర పెత్తందార్ల హత్యలే" నిర్ధారించిండు. "తల్లి దండ్రుల కడుపులు తరగిపోవ వేణుశ్రీకాంత బలిదాన విప్లవమ్ము" ను అమ్మన చంద్రారెడ్డి పద్యంగా మలిచిండు. "తెలంగాణ రాముడిలా లేచింద"ని పెండోట వెంకటేశ్వర్లు పోల్చిండు. "ఉద్యమం ముఖ్యమైనదే జీవితం విలువైనది కదా" విస్తరిస్తూ విస్తృతమవుతూ సాగాలని పప్పుల రాజిరెడ్డి పోరాట లక్ష్యాన్ని వివరించిండు. "మాతల్లి తెలంగాణ పోలీస్‌సే నహీ డర్‌నా - హిమ్మత్ సే కామ్ కర్‌నా" ఫసియొద్దీన్ ఉద్యమ స్ఫూర్తిని వినిపిస్తున్నడు. ప్రాణాలు పోతే లేని బాధ మట్టి బొమ్మలకెందుకో" అని ముద్దం భాగ్యరాణి విగ్రహాలకూల్చివేతను నిలదీస్తున్న సీమాంధ్ర నేతల్ని నిలదీసింది. "ప్రతిమలకున్న విలువ ప్రాణానికి లేదంటారా! అని కరెడ్ల రుక్మిణి అడుగుతున్నది. "జీవం లేని విగ్రహాలను ధ్వంసం చేస్తేనే గుండెలు బాదుకుంటున్న మీరు ఆరువందల మంది తెలంగాణబిడ్డలు ఆహుతైతే సానుభూతి పలకరైతిరి" అని మద్దుల బుచ్చిరాజంరెడ్డి సూటిగా ప్రశ్నించిండు. సమాధానాల్లేని ప్రశ్నలే అన్ని. అన్ని సమస్యలకు పరిష్కారం తెలంగాణ రాష్ట్రమే. "గమ్యము చేరుట ఉద్యమ బాట" అంటున్నడు కొంగర ఎల్లారెడ్డి. "భవిష్యత్ మా పిల్లలకు కావలె" అని మహేష్‌గౌడ్, "మా జానపదం సుసంపన్నం కావాలె, మా రామప్ప శిల్ప అద్భుతాలు మాకే చెందాలె" అని వేణుగోపాల్ ఆకాంక్షిస్తున్నరు. ప్రజల ఆకాంక్ష, కవుల ఆకాంక్ష, నేతల ఆకాంక్ష నెరవేరాలె. తెలంగాణ రాష్ట్ర స్వప్నం సాకారం కావాలె.

కవులు ప్రజల హృదయాలకు ప్రతిబింబాలు. ప్రజా ఉద్యమాలకు ప్రతి రూపాలు కవుల జీవాక్షరాలు. ఆ అక్షరాలు ఫలించాలె. ప్రజలు సుఖించాలె.

**— డా॥ నందిని సిధ్ధారెడ్డి**

 మ.ర.సం. వ్యవస్థాపక అధ్యక్షులు

# అద్దంలో తెలంగాణ



ఐతా చంద్రయ్య
సెల్ 9391205299

వీరతెలంగాణ సాహిత్యానికి వేల సంవత్సరాల చరిత్ర ఉన్నది. ఇతర ప్రాంతాలను కలుపుకుని తెలంగాణను పాలించిన శాతవాహన రాజుల్లో మొదటి వాడైన సిముకుని ఆస్థాన కవి గుణాఢ్యుడు విశ్వకథా సాహిత్యానికి తలమానికమైన బృహత్కథ రచించిండు. ఆనాటి కుందినీనగరము నేటి కొండాపురము మెదకు జిల్లాలో ఉన్నది. శాతవాహనులకిది రెండవ రాజధాని. గాథా సప్తశతి రచింపబడింది ఈ కుందినీనగరములోలే. కాకతీయ ప్రభువుల పాలనలో కళాకాంతులు విశ్వవ్యాప్తమైనయి. ప్రతాపరుద్రుని ఆస్థానములో పేరిణి శివతాండవం నృత్యము కైలాసాన్ని భూమ్మీదికి దించింది.

మరుగున పడిన కాళిదాసు కావ్యసౌందర్యాలను తెలుగులోకి తెచ్చి తమ వ్యాఖ్యానం ద్వారా లోకానికి చాటిన కోలాచలం మల్లినాథ సూరి, భాగవత కావ్య రచననందించిన పోతన తెలంగాణ సాహితీ స్రష్టలే. ఆ మహనీయుల సాహితీ వారసత్వాన్ని పుణికి పుచ్చుకున్న ఎందరెందరో రచయితలు తెలంగాణ సాహితీ క్షేత్రాన్ని సుసంపన్నం చేసింద్రు. పాల్కురికి సోమనాథుడు రాసిన బసవ పురాణం బహుళ ప్రచారం పొందింది. ఆధునిక కాలములో ఉత్కృష్టమైన సాహితీ సంపదను సమకూర్చిన వానమామలై వరదాచార్యులు, వెల్దుర్తి మాణిక్యరావు, ఒద్దిరాజు సోదరులు, దాశరథి, కాళోజీ, సురవరం ప్రతాపరెడ్డి, కోవెల సంపత్కుమారాచార్య లాంటి సాహితీ దిగ్గజాలెందరో తెలుగు సాహితీ సరస్వతికి విలువైన కావ్యాభరణాలు సమర్పించింద్రు. నియంత నిజాము పాలనలో తెలుగు భాషను "తెలంగీ, బేఢంగీ" అని ఎద్దేవా చేసింద్రు. నిజాము సైన్యములోని రజాకార్లు తెలంగాణ విముక్తి ఉద్యమకారుల్ని చిత్రహింసలు పెట్టింద్రు. ఆకాలములోనే దాశరథి " నా తెలంగాణ రతనాల వీణ" అంటూ జైలు శిక్ష అనుభవిస్తూనే అగ్నిధారలు కురిపించిండు.



భారత స్వాతంత్ర్య సమరములో తెల్లదొరల దురహంకారాన్ని తన రచనల ద్వారా ఎదిరించిన ఫలితంగా అండమాన్ జైల్లో ఆజన్మ ఖైదు శిక్షననుభవిస్తూ బొగ్గులతో జైలు గోడలమీద కవితలు రాసిన విశ్వవిప్లవ ప్రణేత వీరసావర్కర్ లా దాశరథి నిజామాబాదు జైలు గోడల మీద బొగ్గుతో కవితలు రాసింద్రు. సురవరం ప్రతాపరెడ్డి 534 తెలంగాణ కవుల గోల్కొండ సంచికను వెలువరించిండు. నిజాము దాస్య శృంఖలాలనుండి తెలంగాణ విముక్తి కోసం పోరాడిన రాధాకృష్ణ (నిజామాబాద్) లాంటి ఎందరో ఆర్యసమాజ్ ఉద్యమకారులు, కొమరం భీం, చాకలి ఐలమ్మ, తుర్రేబాజ్‌ఖాన్, షేక్ బందగీ లాంటి సమర వీరులనెందరినో రజాకార్లు పొట్టన పెట్టుకున్నారు. తెలంగాణ విముక్తి కోసం తనవంతు ప్రయత్నం చేసిన వీరసావర్కరు చిరస్మరణీయుడు. కొండా వెంకటరంగారెడ్డి, పండిత నరేంద్రజీ, బస్వమాణయ్య, మండల నరసింహారెడ్డి మొదలగు సమరవీరులు తాము శిక్షలనుభవిస్తూ తెలంగాణ సాహిత్యానికి స్ఫూర్తి నిచ్చింద్రు.

ఓ వైపు రజాకార్ల వీరంగం కొనసాగుతుంటే మరోవైపు చిందు కళాకారులు యక్షగానాల ప్రదర్శనల ద్వారా తెలంగాణ సంస్కృతిని రక్షించింద్రు. ఆనాటి తెలంగాణ విముక్తి పోరాటం గురించి చెప్తుంటే తెల్లారదు.. పొద్దూకదు...

15-8-1947 నాడు భారతదేశానికి స్వాతంత్ర్యమొచ్చినా తెలంగాణకు రాలేదు. ఎందరో సమరవీరుల త్యాగాల ఫలితంగా సెప్టెంబర్ 1948 లో తెలంగాణ నిజాము నియంతృత్వ పాలన నుండి విముక్తమైంది. ఆనాటి నుండి 31-10-1956 దాకా తెలంగాణ హైద్రాబాద్ రాష్ట్రమై పునర్నిర్మాణములో నిమగ్నమైంది.

తెలంగాణ సమృద్ధిమీద సీమాంధ్రుల కన్ను పడింది. మద్రాసు నుండి విడివడిన ఆంధ్ర రాష్ట్రములో అవస్తపడుతున్న సీమాంధ్ర నేతలు కుట్రలు, కుతంత్రాలు చేసి 1956లో తెలంగాణను ఆంధ్రప్రదేశ్ లో కలుపుకున్నారు. సీమాంధ్రులు తెలంగాణ ప్రజలకేదో ఒరగబెడుతరనుకున్న తెలంగాణ నాయకుల కలలు కల్లలైపోయినై.

స్వతంత్ర భారతదేశంలోని ఆంధ్రప్రదేశ్‌లో అయిష్టంగా కలిసిన

తెలంగాణకు ప్రత్యేక సౌకర్యాలు కల్పిస్తామన్న కేంద్ర ప్రభుత్వం ముల్కీ నిబంధనలు, పెద్దమనుషుల ఒప్పందము తాయిలాల ఆశజూపింది. కాలగమనంలో తాయిలాల మీద తెలంగాణ జారిపడింది. తెలంగాణ వనరుల్ని, ఆత్మగౌరవాన్ని దోచుకోవడమే లక్ష్యంగల సీమాంధ్రనాయకుల దూరదృష్టి కేంద్రాన్ని మానేజ్ చేసి ముల్కీ నిబంధనల్ని, పెద్దమనుషుల ఒప్పందాన్ని తుంగలో తొక్కేసింది. తెలంగాణ యువత నోట్లో దుమ్ము కొట్టి తెలంగాణ ఉద్యోగాలలో వారే వచ్చి కూచున్నరు. తెలంగాణ నుండి కృష్ణ, గోదావరి కాల్వలను మలపుకపొయ్యి సీమాంధ్రలో ప్రాజెక్టులు కట్టుకున్నరు. ఆ ప్రాంతాన్ని సస్యశ్యామలం చేసుకున్నరు. తెలంగాణ తాగు-సాగు నీటి వసతులు లేక విద్య-వైద్య రంగాల్లో వెనుకబడి ఎడారిగా మారిపోయింది. ఆంధ్రప్రదేశ్‌లో తెలంగాణకు ఒక్క కొత్త ప్రాజెక్టు కట్టలేదు.

1969లో తెలంగాణ ప్రజల నిరసన జ్వాలలు ఆకాశాన్నంటినై. ఉద్యమ కెరటాలు ఉవ్వెత్తున ఎగిరిపడినై. తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం కావాలనే ఆకాంక్షతో ప్రజాస్వామ్య బద్ధంగా ఉద్యమించిన 369 మంది యువకులు ఆంధ్ర పాలకుల తుపాకి తూటాలకి బలైపోయింద్రు. ఆనాటి ఉద్యమనేతను ప్రలోభపెట్టిన కారణంగా ఉద్యమం నివురు గప్పిన నిప్పులా ఉండిపోయింది.

సీమాంధ్ర పాలకులు తెలంగాణ సంస్కృతిని, సాహిత్యాన్ని పంట్టించుకోలేదు. తెలంగాణ ఉద్యోగాలు తెలంగాణ వారికే చెందాలనే 610 జీవో వెలువడింది. దానిని మసిబూసి మారేడుగాయ చేసి కాగితాలకే పరిమితం చేస్తూ సీమాంధ్రులు తెలంగాణ ఉద్యోగాల్లో చొరబడింద్రు. రాజధాని అందరిదంటూ సీమాంధ్ర వ్యాపార నాయకులు హైదరాబాదు, రంగారెడ్డి జిల్లాల్లోని భూముల్ని కొల్లగొట్టి వేలాది కోట్ల రూపాయల ఆస్తులు సంపాదించుకున్నారు. టాంక్ బండ మీద నెలకొల్పిన తెలుగు వెలుగు విగ్రహాల్లో తొంభైశాతం సీమాంధ్ర ప్రముఖులకే స్థానం లభించింది. తెలంగాణ తేజోమూర్తులైన ప్రతాపరుద్ర చక్రవర్తి, యుగంధరుడు, కొమురంభీం లాంటి మరెందరికో చోటు దొరకలేదు.

తెలంగాణ తల్లిని బానిసగా మార్చేసింద్రు. పన్నులు వసూళ్లు తెలంగాణలో, ఖర్చులు సీమాంధ్రలో చేస్తూ తెలంగాణ మం త్రులను నోరు



తెరువనీయలేదు. నివురు గప్పిన నిప్పులాగున్న తెలంగాణ రాష్ట్ర సాధన ఉద్యమం 2001 నుండి జ్వాలలు విరజిమ్ముతోంది. 2009లో ఉద్యమం వాడి వేడి ఢిల్లీ ప్రభుత్వాన్ని కదిలించింది. ఫలితంగా 9-12-2009 నాడు కేంద్ర హోంమంత్రి తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడుతున్న ప్రక్రియ ప్రారంభించామన్నారు. తెల్లారి పార్లమెంటులో ప్రకటించింద్రు. సీమాంధ్ర నాయకుల అసలు రంగు అప్పుడు బహిర్గతమైంది. వెంటనే కుట్రలు కుతంత్రాలు చేసి ఆ నిర్ణయాన్ని అడ్డుకున్నరు.

మనోవేదన భరించలేని 600 పైగా తెలంగాణ యువకులు ఆత్మహత్యలకు పాల్పడింద్రు. అయినా సీమాంధ్ర నాయకుల రాతిగుండె కరగలేదు. ఉద్యమం ఇంకా నడుస్తూనే ఉంది. దీక్షలు సాగుతూనే ఉన్నాయి. ఉద్యమ సాహిత్యం వెలువడుతూనే ఉంది. ఈ సాహిత్యం తెలంగాణ ప్రజలకు స్ఫూర్తినిస్తుంది. అందులో భాగంగానే సిద్దిపేట నుండి తెలంగాణ కవితా సంకలనం వెలువడటం శుభసూచకం.

ఈ కవితా సంకలనం ఉద్యమ యజ్ఞ సమిధలైన వేలాది కార్యకర్తలకు నీరాజనాలర్పిస్తుంది. తెలంగాణ రాష్ట్ర సాధనలో పాలుపంచుకుంటున్న తెలంగాణీయులకు స్ఫూర్తినిస్తుంది.

— **ఐతా చంద్రయ్య** కథాశిల్పి
జా.సా.ప. ప్రాంత ఉపాధ్యక్షులు
సిద్దిపేట.

# ప్రస్తుత తెలంగాణ



M.R.V. హన్మంతరెడ్డి
అధ్యక్షులు
రైతు సంఘాల సమైఖ్య, మెదక్ జిల్లా.
సెల్ : 9908882869

1956 నవంబర్ ఒకటిన ఏర్పడిన విశాలాంధ్ర ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ వల్ల కలిగిన వివక్షలు, ఆశ్రిత పక్షపాతము పరిపాలనలో సీమాంధ్రుల ఆధిపత్యము, రాష్ట్రజనాభలో 60% జనాభా కల్గినందున ప్రతినిధుల సభలో ఆధిపత్యముచే, అవినీతి, దురాక్రమణ, దుష్టపాలన, నీతి బాహ్య నియమాకాలు, తెలంగాణపట్ల వివక్ష, కవులు తమ కవితలచే నేటి వరకు జరుగుచున్న నీళ్ల దోపిడి, నిధుల దోపిడి, ఉద్యోగ మరియు ఉపాధులలో సీమాంధ్ర దోపిడిని కండ్లకు కట్టినట్లు వివరించినారు.

ఇంత చక్కటి కవితలు అందించిన కవి మిత్రులకు మరియు ఇట్టి కవితా సంకలనము తీసుకురావటానికి పట్టు విడువని విక్రమార్కునిగా ప్రయత్నించిన మైత్రి మిత్రమండలి అధ్యక్షులు శ్రీ వంగా గాలిరెడ్డి గారిని మెదక్ జిల్లా రైతు సంఘాల సమైఖ్య పక్షాన హృదయపూర్వకముగా అభినందిస్తున్నాను.



# తెలంగాణ మాట

తెలంగాణ ప్రత్యేక రాష్ట్రసాధనకై జరుగుతున్న పోరులో తెలంగాణ కవులు పోరాట యోధుల వెన్నంటే వున్నరు. కవనకవాతు చేసి అద్భుతమైన కవిత్వం సృజిస్తున్నరు. బలిసినవాడి బద్మాష్‌గిరి బూజు దులుపుతున్నరు. ధూంధాం దుమ్ము రేపుతున్నరు. తెలంగాణ ఉద్యమంలో "కదం కదం" కలిపి కదనతురంగమై వీర విహారం చేస్తున్నరు.

తెలంగాణ ఉద్యమానికి పురిటిగడ్డగా పేరుపడ్డ సిద్దిపేట-కవులు, కళాకారులకు పెట్టింది పేరు. వేముగంటి నరసింహచార్యులు, డా॥ కాపు రాజయ్య, డా॥ నందిని సిధారెడ్డి, ఐతా చంద్రయ్య, దేశపతి శ్రీనివాస్, పేరణి రమేష్‌లాల్ వంటి వారెందరో రాష్ట్ర, జాతీయస్థాయిలో గుర్తింపు పొందటమేగాక ప్రపంచం గర్వించదగ్గ కవులకు సిద్దిపేట ప్రసిద్ధి. ఇక్కడ ఎవరిని కదిలించినా కవులై, కళాకారులై, గాయకులై, ఉద్యమసారథులై ఉరుకుతుంటరు. ఆ ఉరకటంలో నిన్నూ, నన్నూ అందర్నీ కదిలించి కదనకవాతు చేయిస్తరు. ఆకోవలో నుండి లావాలా ఉబికి వచ్చిందే ఈ "కదం కదం" తెలంగాణ ఉద్యమ కవితల సంకలనం.

తెలంగాణ రాజకీయ నాయకులను కూడా రాష్ట్ర, జాతీయస్థాయిలో నిలబెట్టిన ఘన చరిత్ర సిద్దిపేటకుంది. మాన్యులు ఎడ్ల గురువారెడ్డి, పి.వి.రాజేశ్వరరావు, ఎ. మదన్‌మోహన్, కల్వకుంట్ల చంద్రశేఖరరావు, తన్నీరు హరీష్‌రావు వంటి ఉద్దండులను అందించిన చరిత్ర సిద్దిపేటది.

ప్రపంచ ఉద్యమాల చరిత్రలో తెలంగాణ ఉద్యమాన్ని వైవిద్యంగా, ప్రజాస్వామ్య బద్ధంగా ఉరకలెత్తిస్తున్న సిద్దిపేట బిడ్డ కల్వకుంట చంద్రశేఖర్‌రావు రంగధాంపల్లి ఆమరణ నిరాహారదీక్ష తెలంగాణ ఉద్యమాన్ని కీలకమైన దశకు చేర్చింది.

తెలంగాణ ఉద్యమ నడిగడ్డగా భాసిల్లుతున్న సిద్దిపేటలో తెలంగాణ రాష్ట్ర సాధనకై జే.ఎ.సి.(ఐక్య కార్యాచరణ కమిటీ) రిలే నిరాహార దీక్షలు నేటికి ఐదువందల ముప్పది రోజులు (530 రోజులు) ఉద్యమ చరిత్రలో చేరాల్సిన అరుదైన సంఘటన.

పాలకవర్గాల మెడలు వంచటానికి గాంధీజి ప్రజలకు అందించిన ఆయుధం. బలహీనుడు బలవంతుడి పైశాచిక హింసకు ఎదురునిలబడి పోరాడుతున్న అహింసా సమరం. ప్రజల సామూహిక సత్యాగ్రహం. అధర్మంపై ధర్మపోరాటం.

కవులు, కళాకారులు, గాయకులు, రాజకీయ, ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మిక, కర్షక వివిధ వర్గాల స్త్రీ, పురుష, ప్రజాసంఘాల ఉద్యమకారులతో కలిసి కదంకదం కలిపి నేనూ ఒక కవినై, పోరాట యోధుడినై తెలంగాణ ఉద్యమపాదిలో బాణమై, గానమై, గాలిలో గాలినై, తెలంగాణ అభిమాన నాదమై నినాదమై, ఎండ వాన చలిని సైతం లెక్కచేయకుండా, పనిపాటలు వదులుకొని తెలంగాణ రావాలనే ఆకాంక్షతో స్వచ్ఛందంగా రిలే దీక్షలకు తరలి వస్తున్న అక్కలకు, చెల్లెండ్లకు చేతులెత్తి నమస్కరిస్తూ అవ్వలకు, తల్లులకు పాదాభివందనం అనుకుంటూ అన్నలకు, తమ్ముల్లకు వెన్నంటి ఉండి వారితో పాటే నేనూ తెలంగాణ సాధిద్దాం. జై తెలంగాణ అంటున్నా.

సిద్ధిపేట కవులు సాహిత్యానికే పరిమితం కాకుండా ప్రజలతో కలిసి తెలంగాణ ఉద్యమంలో పాల్గొంటున్నరు. మరసం ఆవిర్భావం తర్వాత ఇక్కడ సాహిత్య, సాంస్కృతిక చైతన్యం బాగా పెరిగిందనే చెప్పవచ్చు. అట్లాగే తెలంగాణ ఉద్యమంపై కూడ. కవులు, రచయితలు, ప్రజాసంఘాలు తెలంగాణ ఉద్యమానికి సాహిత్యం ద్వార మరింత సన్నిహితం కావాలనే సంకల్పంతో ఈ సంకలనం తీసుకురావడం జరిగింది.

తెలంగాణ తల్లి కడుపున పుట్టినందుకు, తెలంగాణ ఉద్యమ కార్యకర్తగా నేలతల్లి ఋణం తీర్చుకోవటానికి నావంతు కర్తవ్యంగా ఈ చిన్న ప్రయత్నం.

తెలంగాణ రాష్ట్ర సాధన బాధ్యతను పైన వేసుకొని అన్నగా, తమ్మునిగా అందరి మధ్య తనూ ఒకడై, ఆత్మీయంగా తిరుగుతూ, పలకరిస్తూ, పల్లవిస్తూ రాజీనామ సందేశాల్ని భుజానికెత్తుకొని, ఇంతకుముందెన్నడూ కనీవినీ ఎరుగని రీతిలో లక్ష ఓట్ల ప్రజాభిమానాన్ని సంపాదించి, రాష్ట్ర, జాతీయ నాయకులను సైతం విస్మయపరచి సిద్ధిపేట గడ్డకు ఘనకీర్తిని తెచ్చిపెడుతున్న గౌరవ శాసనసభ్యులు హరీష్‌రావు గారికి తెలంగాణ ఉద్యమ జేజేలు పలుకకుండా ఎట్లుండగలను..?

అదేవిధంగా మా తెలంగాణ ఆత్మీయనేస్తం, మరసం, తెరవేల వ్యవస్థాపక



అధ్యక్షులు, తెలంగాణ ఉద్యమనేపథ్యాన్ని తనువునిండా తనదిగా చేసుకొని బందారంలో విరబూసిన మందారమై, తెలంగాణ ప్రభాకరుడై, తెలంగాణ తేజస్సును పంచిపెడుతున్న డా॥ నందిని సిధారెడ్డి గారికి సమయమిచ్చి సమీక్ష రాసిచ్చినందులకు మా ఆత్మీయ అక్షరాభివందనములు

ఆట్లాగే ప్రముఖ తెలంగాణ కథకులు గా ప్రసిద్ధి పొందిన కవి మిత్రులు జాతీయ సాహిత్య పరిషత్తు రాష్ట్ర ఉపాధ్యక్షులు ఐతా చంద్రయ్య గారు తెలంగాణ తేజోమూర్తులను పరిచయంచేసి ఈ సంకలనాన్ని పరిమళింపజేసినందుకు వారికి శతదా వందనములు.

అడిగిన వెంటనే సంకలనానికి ముఖచిత్రం అందించిన ప్రముఖ శిల్పి, చిత్రకారులు రమణారెడ్డి గారికి ప్రత్యేక నమస్సులు. అభినందనలు తెలిపిన ఆత్మీయ మిత్రులురైతు సంఘాల సమాఖ్య మెదక్ జిల్లా గౌరవాధ్యక్షులు హన్మంతరెడ్డి గారికి, కవితల సేకరణలో కీలక బాధ్యతలు నిర్వహించిన కవి మిత్రులు డబ్బీకార్ సురేందర్ గారలకు తెలంగాణ ఉద్యమాభివందనములు.

ఈ సంకలనం తేవడంలో సహృదయంతో తమ కవితలను అందించి సహకరించిన కవులందరికీ సదా కృతజ్ఞతలు. సమీక్ష రాసేనాటికి అందకపోయినప్పటికి కొంచెం ఆలస్యమయినా మంచి కవితలు రాసి పంపిన కవి మిత్రులు రంగాచారి, తైదల అంజయ్య, పొన్నాల బాలయ్య తదితరులకు ప్రత్యేక ధన్యవాదాలు...

సదా మీ

తేది : 18-6-2011

సిద్ధిపేట.

**వంగా గాలిరెడ్డి**

స్వాతంత్ర్య సమరయోధులు

# నివేదన

**పుట్టుక నీది, చావు నీది, బ్రతుకు అంత దేశానికి**

— కాళోజి

తెలంగాణ మట్టి పొత్తిల్లలో పోరాటాలు కొత్తకాదు, దొరల, భూస్వాముల, పెత్తందారుల, పటేండ్ల, పట్వారీల అగచాట్లు అన్నిదాటిన కన్నీటి నా దారులు ఆగిపోలేదు. 56 సంవత్సరాల ఆంధ్రుల ఆగడాలకు మన నీల్లు, నిధులు, వనరులు, కొలువులు, నెలవులు, భాష, సంస్కృతి అన్నీ దోపిడికి గురైనయి. అణిచివేతల పై గళాలు కలాలు పిడికిలు పిడుగులై ఉద్యమాలు ఉప్పెనైన నా తెలంగాణ తల్లి కన్నీరు ఆగిపోలేదు. ఇది ఆంధ్రుల పెత్తనం పై విముక్తి పోరాటం. దశాబ్దకాల ఉద్యమాన్ని మాన్యశ్రీ కే.సి.ఆర్. గారు తన మడమ తిప్పకుండ మకుటాయ మానంగా నడిపి అన్ని వర్గాల, కులాల, మతాల, రాజకీయ పార్టీల గడప కడప కడిగి అడిగి కొండకొండకు కోటి దండాలు పెట్టి చివరికి ప్రాణాలు పణంగా పెట్టి సాధించిన తెలంగాణకు, ఈ ప్రాంత నేతలే మూతులు నాకే సంస్కృతికి గుండెలు పగిలి రగిలి ఆరు నూర్ల మంది ఆత్మబలిదానాలు జరిగినది. ఇది ఆఖరి పోరాటం ఉద్యమాల అడ్డ సిద్ధిపేట గడ్డ నుండి 56 మంది కవులు కలాల్లోంచి రక్తాక్షరాలు ఉద్యమాన్ని నాలుగున్నర కోట్ల తెలంగాణ బిడ్డల గుండె తట్టి కార్యసూరుల్ని చేయడానికి ఈ కవిత సంపుటి కదం కదం తెలంగాణై సాగుతుంది. ఈ సంపుటికి కవితలు ఇచ్చిన కవులందరికి అక్షరాభివందనములు. మా కవితా సంకలనమునకు వెన్నుతట్టి నడిపిన పెద్దలు గురుతుల్యులు డా॥ నందిని సిధారెడ్డి గారికి కృతజ్ఞతాపూర్వక ఉద్యమాభివందనములు. చరిత్ర చేవ్రాలు చేసిన పెద్దలు శ్రీ ఐతా చంద్రయ్య గారికి ప్రత్యేక నమస్కారములు. ఆశీర్వాద వాక్యాలు రాసిన శ్రీ మారెడ్డి హన్మంతరెడ్డి గారికి ధన్యవాదములు. పుస్తక కర్త నిరాడంబర హృదయుడు స్వాతంత్ర్య సమరయోధులు శ్రీ వంగా గాలిరెడ్డి గారికి ఎల్లప్పుడూ ఋణపడే ఉంటాను.



అచ్చు తప్పుల్ని దిద్ది అనేక అమూల్య సలహాలు ఇచ్చిన కవిమిత్రులకు అభినందనలు. పుస్తక ముఖ చిత్రాన్ని అందంగా తీర్చిదిద్దిఇచ్చిన చిత్ర, శిల్పకారులు శ్రీ రమణారెడ్డి గారికి హృదయపూర్వక కృతజ్ఞతలు. అందుకు సహకరించిన తోట అశోక్ గారికి ప్రత్యేక నమస్కారములు. సంపుటి చివరి కవర్ పేజికి అమరవీరుల స్మారక స్థూప చిత్రాన్ని అందించిన రూపశిల్పి ఆచార్య శ్రీ ఎక్కా యాదగిరి రావు గారికి ప్రత్యేక ఉద్యమాభివందనములు. మృదుభాషి నిరంతర ప్రజా సేవకుడు మా ప్రియతమ నాయకుడు శ్రీ తన్నీరు హరీష్‌రావు, సిద్దిపేట శాసన సభ్యులు గారికి హృదయపూర్వక ధన్యవాదములు తెలుపుతున్నాను.

ఇంతటి ఈ "కదం కదం" కవితా సంపుటిని ఎంతో అందంగా పుస్తక రూపంలో తీర్చి దిద్దిన **శ్రీ కమల్ గ్రాఫిక్స్, సిద్దిపేట** గారికి ధన్యవాదములు

ప్రత్యక్ష పోరాటాల్లో పాల్గొన్న యావత్‌మంది తెలంగాణ బిడ్డలకు ఉద్యమాభివందనములతో...

మీ

డబ్బీకార్ సురేందర్

# తెలంగానం



**ఐతా చంద్రయ్య**
సిద్దిపేట.
సెల్ : 9391205299

తరతరాల తెలంగాణ
తండ్లాటలు మోస్తున్నది.
తెలంగాణ ఎత కథలకు
తెల్లారదు, పొద్దూకదు.

మద్రాసుకు బానిసలై
మసకమారిన సీమాంధ్రులు.
నైజామును విడగొట్టి
పడగొట్టిరి తమ వలల.

మనమంతా వొకటేనని
మాయోపాయం జేసిరి.
తెలుగుజాతి సమానమని
తెలివిమీరి నమ్మించిరి.

భాషపేర తెలంగాణకు
బాధల హారమువేసిరి.
విశాలాంధ్ర పేరుజెప్పి
విపరీతము కొడగట్టిరి.

పెద్ద మనుషులొప్పందము
పేర సూత్రములు రాసిరి.
ముల్కీ నిబంధనలని
ముందుగానె మురిపించిరి.

ఇసంత రమ్మనగానే
ఇల్లంతా మాదనిరి.
నిలువనీడ అడిగినోళ్ళ
నిలువు దోపిడి జేసిరి.

పన్నుల వసూళ్ళిక్కడ
ప్రాజెక్టుల పనులక్కడ.
వ్యవసాయం వెలుగక్కడ
వలసబతుకు చీకటిచట.

సుఖసంతోషాలక్కడ
చావులు, ఆకలి యిక్కడ.
అన్ని సౌకర్యాలక్కడ
ఆత్మహత్యలిక్కడ.

పోతన కవి మావాడని
ఫోజులు విసిరేసినారు.
తెలంగాణ కళలంటే
తక్కువ ప్రాధాన్యమనిరి.

హైదరబాదు రాజధాని
లడుగుపెట్టి నారప్పుడు.
రానురాను తెలంగాణ
నంతా కబళించిరిపుడు.

కృష్ణా గోదావరి, తుంగ
కాలువలను మళ్ళించిరి.
అన్ని సాగు ప్రాజెక్టుల
నక్కడికే లాక్కెళ్లిరి.

తెలంగాణ ఉద్యోగాలు
సీమాంధ్రుల వశమాయె.
విద్య-వైద్య వసతులన్ని
అక్కడికే తరలిపోయె.

తెలంగాణ నేతల మూ
తులకు నేతులను బూసిరి.
బుజ్జగించి పదవులతో
మూటలు సంపాదించిరి.

మాయమాటను జెప్పి
మచ్చుజల్లి చెలరేగిరి.
ఒప్పందాలన్నింటిని
వరుసగ తుంగలోదొక్కిరి.

తాగు-సాగు నీరులేక
తెలంగాణ ఎడారాయె.
పాడిపంటలతో కోస్తా
సస్యశ్యామలమాయె.

పోలవరం, పోతిరెడ్డి
ప్రాజెక్టులు అక్కడ.
వందలాది ఊర్లు మునిగి
అంగలార్పులిక్కడ.

హైద్రాబాదు నాక్రమించి
అడ్డా బిఠాయించిరి.
సమైక్యాంధ్ర ఉండాలని
చావుదెబ్బలే కొట్టిరి.

విరిగె పోయె మనసులు
కరిగె తెలుగు వెలుగులు.
కలిసుంటే కయ్యాలు
విడిపోతే వియ్యాలు.





# బంగారు బతుకమ్మ



**వంగా గాలిరెడ్డి**
సెల్ : 9391813526

రావణాసురుడు వచ్చాడులే
రామావతారము తెచ్చాడులే
సీతమ్మ కష్టాలు మీకెందుకని
తనవెంట తీసుకపోయాడులే
అయోధ్య నగరికి - లంకాపురికి
లెంకపెట్టేసి సచ్చాడులే
రావణకాష్ఠం రగిలించి నేడు
యాటపటాకులు పేల్చారులే
గాంధీ మహాత్ముడు వచ్చాడులే
మనకు స్వాతంత్ర్యం తెచ్చాడులే
స్వాతంత్ర్యఫలములు సక్కంగ అందక
సామాన్య జనమెల్ల తచ్చాడెలే
సీమాంధ్ర సితరంగి వచ్చిందిలే
సిక్కోలు కష్టాలు తెచ్చిందిలే
వాసికెక్కిన గొప్ప వారకాంతోలే
వయ్యారి బామై కులికిందిలే
తెలంగాణ తల్లిని చెరబట్టి చెరబట్టి
దాసి దానిని చేసిదోసిందిలే
దోసిన సొమ్మంత కక్కించటానికి
కేసిఆరొక్కడు వచ్చిండులే
కావలికుక్కోలె తానుంటనని
తెలంగాణ ఉద్యమం తెచ్చిండులే

కచ్చాపెక్కా వాడు కసిరించి కదిలించి
తెలంగాణ ప్రజలను ఉసిగొల్పాడులే
నీలాపనిందలు అన్నింటిని మింగి
శివుని అవతారము ఎత్తిండులే
హరిహరాదులవోలె అన్న హరీషన్న
శేఖరన్నకు తోడు నిలిచిండులే
బర్రెజెనిగలోలె బలిసినోల్లందరినే
దుర్మార్గులందరిని దులిపేస్తడులే
తెలంగాణ పౌరుషము తెచ్చిండులే
వెన్నుతట్టి మనకు ఇచ్చిండులే
చీకటి తెరలను తొలగించుకుంటు
తెలంగాణ తల్లి వస్తుందిలే
పొద్దంత వెలుగు ఇస్తుందిలే
బంతిపూలవన్నె బంగారువన్నె
బతుకమ్మ పండుగై వస్తుందిలే
బతుకంత పండుగ చేస్తుందిలే

# తెలంగాణ పోరు



ఉండ్రాళ్ళ రాజేశం
సెల్ : 9966946084

తెలంగాణ పోరు
మన గుండెల్లో మారుమ్రోగు !!
మన రైతాంగానికి లేవు
గోదావరి నీళ్ళు
కుల వృత్తుల వారికి
లేదు జీవనోపాధి
విద్యార్థి లోకానికి
లేనిది ఉద్యోగం
కల్గినది నిరుద్యోగం
తెలంగాణ పోరు
మన గుండెల్లో మారుమ్రోగు !!
ముఖ్యమంత్రులు వారివి
ముష్టి పదవులు మనవి
బడ్జెట్ అసెంబ్లీలో
బ్రతుకులు వారికి
బాధలు మనవి
పేరుకు హైద్రాబాద్ మనది
ఉద్యోగాల్లో ఉండేది
దోచుకునేది వారేమరి
తెలంగాణ పోరు
మన గుండెల్లో మారుమ్రోగు !!
వానలెక్కువస్తే కోట్లల్లో
నష్టపరిహారం వారికి
పంటలెండితె ఇవ్వని
ఋణ సౌకర్యం మనకు
వారి చదువులకు
కోట్లు ఇస్తారు
మన చదువులకు
చెట్లున్నయంటరు.
సినిమాల్లో వారి భాషను
చూసి నవ్వమంటరు
మన యాసను తెలిపి
వెక్కిరిస్తరు
తెలంగాణ పోరు
మన గుండెల్లో మారుమ్రోగు !!
అందుకే మనవాళ్ళు లగడపాటితో
జగడానికి సిద్ధమంటరు
చిరంజీవి వద్దు తెలంగాణ
ధూందాం ముద్దు అంటరు
పాలుతాగే పిల్లాడు రోశయ్య
గోసి విప్పుతాంటడు
బడికెళ్ళే చిన్నారి చంద్రబాబు కాదు
ఆంధ్ర బాబు అని రాస్తుంటది
తెలంగాణ పోరు
మన గుండెల్లో మారుమ్రోగు !!
మూలకున్న ముసలయ్య
ఒడిసెలు, బడిసెలు
బందుకులు మూలకున్నయి ఇస్తన్నడు
అదివిన్న అవ్వేమో నిజాం
రాజును దంచినట్లు
ఆంధ్రవారిని దంచుమంది
మరి ఇలాంటి విప్లవం
ఎన్నడూ కానరాలే
ఇక తెలంగాణ రాష్ట్రం
"2011" లో తథ్యం చూడు ఇక....
జై తెలంగాణ! జైజై తెలంగాణ !!





# మా తెలంగాణ మాగ్గావాలె



ఎన్. భగవాన్‌రెడ్డి
సెల్ : 9492913165

తుంటరి తనానికి
అమాయకత్వానికి
భాషతో బంధమేసినపుడు
మనుషులు కదాని
మాటల్ని నమ్మినం
కుట్రలేవో కుతంత్రాలేవో
కనిపెట్టలేకపోయాం
ఒప్పందాల తప్పిదాలతో
మోసపోయినం
పెనం మీంచి పొయ్యిలో పడ్డాం
కల్సిఉంటే కష్టాల పాలైందెవరో
సుఖాలు దక్కిందెవరికో
సమైక్య రాగంలో
సమానత్వమెంతో చూశాం
సమస్యలపై సమరాలు
ఉల్లంఘనలపై ఉద్యమాలు చేశాం
బలైందెవరో బాగుపడిందిఎవరో
బాగానే తెల్సుకున్నం
నెర్రెలు బారిన నేలలు
బండలైన బతుకులు
కమిలిన గాయాలు
రగిలిన గుండెలు
రాలిన ప్రాణాలు
ఒక్క బాధ గాదు
తీరొక్కబాధలు పడ్డం
నిలువెల్ల గాయాలె
ఐదు దశాబ్దాలుగా
దగా పడిందెవరో
దగా చేస్తుందెవరో చూశాం
ఐదేండ్ల జాతర్లో లేని ఆటంకం
డిశంబర్ తొమ్మిదికెందుకొచ్చిందో
రాజకీయ రంకుతనం తెల్సింది
ఇగ చాలు మీ హుషారు
ఏకాభిప్రాయం పేరుతో
భిన్నాభిప్రాయాల్లో
ఏకాభిప్రాయం కుదరదు
కావాల్సిందొక్కటే
బలగాలొద్దు బందూకులొద్దు
కవాతులొద్దు కలహాలొద్దు
పల్లె పట్నం - ఊరూ వాడా
చిన్నా పెద్దా - పేద గొప్ప
కులం మతం ఏదీ లేదు
జన చేతనమైన తెలంగాణ
పిడికిళ్ళెత్తి నినదిస్తూ
గజ్జెకట్టి ఆడుతుంది
గళమెత్తి పాడుతుంది
మా తెలంగాణ మాగ్గావాలె
మా తెలంగాణ మాగ్గావాలని

# తోలుబొమ్మలాట



కందుకూరి శ్రీరాములు
సెల్ : 9440119245

సోదర సోదరీమణులారా !
మాన ప్రాణ అభిమానమున్న దేశ ప్రజలారా !
వినండి కనండి తరించండి !

కృష్ణార్జున యుద్ధానికి మించిన
రామాంజనేయ యుద్ధానికి మించిన
వాలి సుగ్రీవుల యుద్ధానికి మించిన
జానపద చారిత్రక సాంఘీక సమ్మేళనంతో
పౌరాణిక ప్రాంతీయ రాజకీయ సంఘర్షణలతో
రసవత్తరమైన సవిస్తరమైన
మహోన్నతమైన ఘట్టనలతో
మహత్తరమైన సన్నివేశాలతో
అద్భుతమైన నటన
సమున్నతమైన వ్యధ
సంపూర్ణమైన కథ
గొప్ప ప్రణాళికతో
పెద్ద ప్రదర్శనతో
సరికొత్త సంవిధాన ఆటను
తిలకించండి ! పులకించండి !

నాటకం కాదు భాగవతం కాదు జీవితం
కైలాసం కాదు, వైకుంఠం కాదు, భూలోకం
కులాసకాదు, జల్సాకాదు, బతుకుపోరాటం
పదండి ప్రదర్శనశాలకు
చూడండి తనివి తీరేంతవరకు





తెర వెలిగిందహో !
ఆట మొదలైందహో !!
తెరమీద రెండు బొమ్మలాడుతున్నాయహో !!!

ఒక బొమ్మ
రెండు పట్టంచుల నదుల్తో
పచ్చని సమైక్య పంట చీరకట్టుకుని
బంగారం లాంటి
బంగాళఖాతం బొట్టుపెట్టుకుంది

మరోబొమ్మ
అస్తిత్వం చాడునేల దేహానికి
తుమ్మపూల చీరకట్టి
చిలకలాంటి
చెలక బొట్టు పెట్టింది

ఒకటి అందంగా సింగారించుకున్న
సుందరాంగి !
మరొకటి అంగాంగం కంటపడుతున్న
బురదాంగి !

తెరమీద ఆటమొదలైంది
తోలుబొమ్మలాట !

❋ ❋ ❋

# పొత్తు..."త్తు"



ఎన్నవెళ్లి రాజమౌళి
రాష్ట్ర ఉత్తమ ఉపాధ్యాయులు
సెల్ : 9848592331

ఇచ్చేది మేమే....
తెచ్చేది మేమే....
ఇది బూటకం
ఇచ్చేదెవరు ?
తెచ్చేదెవరు ?
తెలంగాణ రాష్ట్రమే కాదు....
రాజ్యం !
నిజాం కాలంలో
తెలంగాణుల భోజ్యం
ఇప్పుడైనది
ఆంధ్రులకు నైవేద్యం
మోసం చేసి...
మీసం వాల్చి...
మైత్రి అని...
పొత్తైనారు
**పొత్తు..."త్తు"** అనేలా
చిత్తు చేశారు
ఇకసాగవు మీ జిత్తులు
హద్దులు దాటకముందే...
ఆంధ్రులు దాటాలే....
లేకుంటే తిత్తులు
పగులుతాయి !





# ఎముకల గూడు నా తల్లి తెలంగాణ



మహమూద్ పాషా
సెల్ : 9010597575

అమ్మా నా తెలంగాణ!
అవ్వా నా తెలంగాణ!!
పల్లే నా తెలంగాణ !!
అయ్యో నా తెలంగాణా
ఎక్కి ఎక్కి ఏడ్వకు
ఏడ్చి ఏడ్చి కన్నీళ్ళతో
ముఖం కడుక్కొంటున్నావ్!
సమైక్యవలసవాదుల
సంకెళ్ళలో బంధించబడిన
నాతల్లి తెలంగాణ!
విషాద తరుఛాయ క్రింద
"ఎముకల గూడై మిగిలినావ్"
వట్టిపోయిన బతుకునీది
నోటికందని మెతుకునీది
అమ్మా నా తెలంగాణ
అవ్వా నా తెలంగాణ
ఇవ్వాళ్ళ! నీ బిడ్డలు
సోయితప్పిన నిద్రనుండి మేలుకొని
జై తెలంగాణ అంటూ
తెలంగాణ యుద్ధరంగంలో
వీరులై నిలబడినారు ఎందరో!
అమర వీరులైనారు
కె.సి.ఆర్. ఆమరణ నిరాహారదీక్షతో
నా తెలంగాణ కల్లోలం అయింది
అగ్నిగుండమైంది.
శ్రీకాంత్, వేణుగోపాల్, సువర్ణ
మరిఇంకెందరి "ఆత్మబలిదానం"
మా కళ్ళల్లో మా గుండెల్లో
వజ్ర సంకల్పమైంది
గద్దర్ గళగర్జనతో
నలుదిక్కుల తెలంగాణ
మారుమ్రోగింది
కవులు, కళాకారులు,
రచయితలు, మేధావులు,
విద్యావంతులు, విద్యార్థులు,

ఉద్యోగులు, రైతులు, కూలీలు
వివిద కులవృత్తుల వాళ్ళు !
తెలంగాణ జనమంత
దండు దడుముతో
పల్లె పల్లె కదుప కదుప
ఆటా-పాటా తో కదిలింది
నా తెలంగాణ కదింలింది కదిలింది
రాజకీయ నాయకులు, లాయర్లు
"పార్టీ" జెండాలు, ఎజెండాలు
పక్కకుపెట్టి
"జై తెలంగాణ జండా"
ఒక్కటై ఎత్తింద్రు
కోదండరామ్ నాయకత్వంలో
జె.ఏ.సి. గా జతకట్టి
విశ్వరూపమే చూపింద్రూ
ఉద్యమ పోరాట పాటలతో
గాయకులు, కవులు, కళాకారులు
ముక్తంఠంతో పోటెత్తి
పొంగిపోయింది నా తెలంగాణ
కన్నీళ్ళు, ఆకలి, ఆత్మహత్యల తో
నా తెలంగాణ వల్లకాడుగా మిగిలింది
ఆంధ్ర వలసవాదులు
సమైక్యవాదంతో అభివృద్ధి అంటూ
జిత్తుల తో ఎత్తులతో
ఉచ్చులు బిగిస్తున్నారు. ఇవ్వాళ్ళ!
పరిపాలకులు, అధికారులు వాళ్ళు
మనం తెలంగాణవాళ్ళం!!
పాలితులం! చెప్రాసిలం మనం
ఆంధ్ర నవాబులకు
"జీసలాం" "జీగులాం"
"చిత్తందొర" అంటూ
బతుకులను ఈడ్చుతున్నాం
ఆత్మగౌరవం! వివక్షత!!
దోపిడిపీడన తో
చచ్చిబతుకుతున్నాం
ఇవ్వాళ! "హైద్రాబాద్ హైటెక్‌సిటీ"
స్వర్గసీమ వాళ్ళకు
బంజారాహిల్స్, జూబ్లీహిల్స్,
వనస్థలిపురం, నెక్లెస్ రోడ్
హంస తూలిక తల్పంపై
సుఖనిద్రలో
సుందర స్వప్నాలు కంటున్నారు
వాళ్ళకు పోరుతెలంగాణ,
వీరతెలంగాణ పీడకలైంది.
ముళ్ళపాన్పు అయింది.
52 సంవత్సరాల ముందు





"సమైక్య ఆంధ్రులు"
తెలంగాణతో జతకట్టి
తెలంగాణ భూముల్ని!
నీటివనరుల్ని!!
ప్రకృతి సంపదను
తెలంగాణ ప్రజల హక్కుల్ని !!!
నూటికి తొంబది శాతం
ఉద్యోగాల్ని దోచినారు.
అభివృద్ధి అంటూ తెలంగాణలో
"అధికారం సిక్కాను"
చెలాయించుతున్నారు
మా తెలుగు భాషను
భాషకాదన్నారు.
మా ప్రతి పండుగల్ని
పండుగలు కావన్నారు
మా సంస్కృతి సాంప్రదాయాలను,
చరిత్రను అసలేకాదన్నారు
తెలంగాణ వాళ్లను
మనుష్యులే కాదన్నారు.
అన్ని రంగాల్లో పెత్తనం వాళ్ళది
అనుభవం సుఖం వాళ్ళది
ఇక మీ దోపిడి సాగదు సాగదు !
ఇక మీ పెత్తనం సాగదు సాగదు !!
మేము! తెలంగాణ కాదంటే!!
జారవిడుచుకుంటే!
రేపు రాబోయే మాతరం
మమ్ముల్ని క్షమించదు
ఇవ్వాళ! తెలంగాణ
కాలపరీక్షకు ఎదురు నిలిచింది
తెలంగాణ జనజీవనం
నిరంతర యుద్ధరంగమైంది
తెలంగాణ పోరాట యోధులు!
రేపు తెలంగాణను సాధిస్తారు!!
తూర్పుశిఖరం మీద
సూర్యుడిలా - రేపు
తెలంగాణ నలుదిశల్లో
తెలంగాణ జండా ఎగురుతూ
రెపరెపలాడుతుంది.

# తెలంగాణ బతుకు



జంగిటి శాంతకుమారి
సెల్ : 9652483644

పది జిల్లాల తెలంగాణ పోరులు
దగాపడ్డ జీవితాల కడుపు మంట
వాగులన్నీ పరుగులు బారుతున్నా...
గొంతు తడవని బతుకులు మావి
మెదక్ జిల్లా మెతుకు సీమ యైనను...
కంచములో మూడు మెతుకులు లేని జీవితాలు
దశాబ్దాల బతుకు పోరుతో...
ఇంకెన్నాళ్లీ దారిద్ర్యాలు, దౌర్జన్యాలు
కదం కట్టి పదం పట్టి పల్లె పల్లెల్లో
తెలంగాణ నినాదాన్ని వినిపిద్దాం
సమైక్యాంధ్రుల సంపదల పోరు
తెలంగాణ వాదులకు జీవిత మనుగడ పోరు
వినబడటం లేదా క్యాంపస్ విద్యార్థుల ఘోష
తెలంగాణా సాధనకై ఆత్మార్పణల హేష...
ప్రాణాలను అర్పించినా...
బడాచోరు రాబందుల స్వార్థపూరిత పోరాటాలు ఎందుకు ?
నాలుగుకోట్ల తెలంగాణ వాదుల పురిటిగడ్డ
సమర శంఖారావం పూరిస్తుంది రాష్ట్ర సాధనకై







# నా తెలంగాణ



కాజీపేట కిరణ్ కుమార్
సెల్ : 9247218181

కోటి రతనాల వీణ నా తెలంగాణ
నేడు నాలుగుకోట్ల గుండె రగిలిన వీణ
దోపిడీదారుల గానా భజానా
నాడు పురివిప్పి ఆడిన జాతీయ పక్షి
నేడు చుక్క నీటి కొరకు అలమటించె
చకోరపక్షియై !
నాటి అన్నపూర్ణ నా మెతుకు సీమ
నేడు ఆత్మహత్యల నిలయం
వనరులెన్నో ఉన్న నా తెలంగాణ
వలస బాటపట్టె నా తెలంగాణ
సింగరేణిలోన నల్ల బంగారం
దోపిడి దారుల కొంగు బంగారం
పంట చేలలోన మయూరి నాట్య మాడెనప్పుడు
కరువు, కాటకాల విలయతాండవమిప్పుడు
నాటి నా తెలంగాణ సిరివెలుగుల తోట
సాధించేదాక తప్పదు ఉద్యమాల బాట.



# బాత దాటుదామిక



కె. అంజయ్య
సెల్ : 9985411090

ఏడాదైంది
ఇంకెంతకాలం
ఓపికకు గెట్టులుండొద్దా ?
రజాకార్లను దునుమాడాం
తుపాకులకు ప్రాణాలొదిలాం
నిజాం బూజు దులిపేశాం
స్వాతంత్ర్యమంటూ
పీకేశారు పరగణాల గోచీ
ఇచ్చారు సీమాంధ్ర తుండుగుడ్డ
తుడుచుకుందామంటే మొఖం
మెడకు బిగిసిన తుండు
మనకు 54 శిశిరాలు
వాళ్ళకు 108 వసంతాలు
ఏడాదైందీ
ఇంకెంతకాలం
సహనానికి బాతగీయొద్దా ?
ఏళ్ళకేళ్ళు నానబెడుతుంటే
ఊళ్ళకూళ్ళు పుచ్చి బుర్రలైనాయి
బతుకులు మురిగి పోతున్నాయి
పచ్చగున్న చోట పల్లేరు
తెగింది చెరువుల గొలుసు బంధం
నాడు నీరూరే చెలిమలు
నేడు ఇంకుడు గుంతలు
ఏడాదైంది
ఇంకెంతకాలం
గోడకేసిన ఆయుధంలా ఎన్నాళ్ళు ?
హనుమాన్ కాషాయాలు
గణేష్ మాలధారణలు
శరణాగతి గోవిందమాలలు
అయ్యప్పదీక్షలు
పరిమితి... పరిమితి
అర్ధమండం
మండలం
అష్టోత్తరం
అంతే ముగింపు అంతే
ఏడాదైనా తెలంగాణ దీక్షలు
ఇంకెంతకాలం
మౌనాన్ని కొత్తపుంతలు తొక్కించాలి
జనమే జనమై నినదించాం
ప్రభంజనమై ఎలుగెత్తాం
ఓపికకు గెట్టులుండొద్దా
సహనం బాత దాటొద్దా....





# గెలుపు మాదే



జక్కుల వెంకటేశం
సెల్ : 9440481745

నమ్మిమోసపోవడం పోరాడడం
నామట్టి నుదుటి రాతనో ఏమో!
పందులు పడ్డ పంటచేనోలె
అంత కుల్లబొడ్వవడితిరి
56 ఏండ్ల దోపిడికి అంతం ఎప్పుడో!
చారి రక్తం మాడుతు మండుతున్నప్పుడు
ఆ మంటల సాక్షిగా తెలంగాణ కోసం
నాలుగు కోట్ల బిడ్డలు ప్రమాణం చేశారు
పోరాటంలో ఈ పొద్దు గెలుపు మాదే
కదం తొక్కిన తెలంగాణంలో
కాక తప్పదు పరాయి పాలన అంతం
మన నీళ్లు, నిదులు మనకే
మన జాగలు, జాబులు మనకే
ఎత్తిన పిడికిల్లు ఎలుగెత్తితే
ఆంధ్రోని అడ్డలు మాయం కావాలే
తుండుగుడ్డ జారిపోగ.................
తెలంగాణ తల్లి రుణం తీర్చ
కదంతొక్కిన తెలంగానం
జై తెలంగాణ - జై జై తెలంగాణ

# తెలంగాణం ఉద్యమం



కూర్పు :
**యం.ఎ. ఘనీ**
సెల్ : 9849961662

అనాడే ఉద్యమించాము విశాలాంధ్ర వద్దని
ఈనాడు ఉద్యమిస్తున్నాము తెలంగాణ రాష్ట్రం కావాలని
ఈ ఉద్యమాలు మాకేమి కొత్తవి కావు
ఎదిరించాము ఎన్నింటినో ధైర్య సాహసంతో
చవిచూశాము నిరంకుశ పరిపాలన
జై హింద్ అంటూ స్వాగతించాము ప్రజాస్వామ్యం
విదేశీయులు భారత ప్రధాని కావద్దంటే
ఆ కోపతాపాలు తెలంగాణ రాష్ట్రం కావద్దనియా?
గల్లీ నుండి ఢిల్లీ వరకు ఒకే నినాదం
జై తెలంగాణ తప్ప మరేమి చేయడం లేదు జపం
కదిలింది విద్యార్థి లోకం - ఆగదు ఇక ఈ ఉద్యమం
ఉద్యోగుల నిరసనలు మారుమోగినాయి
ఆడపడుచులు నిరూపించారు తమ సంఘటిత శక్తి
తట్టుకోలేక పోతుంది ప్రభుత్వం పరిస్థితి
ప్రజల్లో నెలకొన్నది అంతటా అలజడి
నాయకుల్లో ఉంది అనిశ్చిత పరిస్థితి
తరచూ అవలంబిస్తున్నారు అనాలోచిత వైఖరి
విద్యార్థుల పట్ల ప్రభుత్వ మొండి వైఖరి
ఉద్యోగులపట్ల దమన నీతి
ఎన్నాళ్ళు అయిన ఆగదు ఈ ఉద్యమం
ఎన్ని అడ్డంకులు ఎదురైనా ఆగదు ఈ సమరం
వృథాపోదు అమరవీరుల త్యాగఫలం
ఫలించక తప్పదు విద్యార్థి, ఉద్యోగ, కార్మికుల తపోబలం
చంద్రశేఖరా! మీ ధైర్యసాహసాలకు ఉద్యమమే స్ఫూర్తి
మీ ఆమరణ దీక్షకు ప్రజలే సాక్షి
తెలంగాణ రాష్ట్రానికి మేమందరమున్నాము కాపలా
మీ ప్రాణానికి మేమందరమున్నాము కనురెప్పలా





# తండ్లాట



**బోరెడ్డి మధుసూదన్‌రెడ్డి**
సెల్ : 9491331611

కళకళలాడే పచ్చని పల్లెలను
కల్లోలం చేసిందెవరు ?
మా ఎనగుర్తిని ఎలిసిపోయిన
బట్టగ మార్చిందెవరు ?
మా వూరికి మణి కిరీటమైన
బోరబండను బోడగ చేసిందెవరు ?

దుబ్బాక దొరల దూపదీర్చిన
మా బ్రాహ్మణ్ల చెలిమను
ఆనవాలు లేకుండా అదృశ్యం చేసిందెవరు ?

తల్లి....... బిడ్డను కడుపులో దాచినట్టు
మా కూడెల్లి వాగు దాచుకున్న ఉసికెను
ఉసికెలోని నీటిని మాయం చేసిందెవరు ?

పొద్దు గూకినంక.....................
అలిసిపోయిన అన్నదాతలందరు
కచీరు గద్దెమీద సమూహమై
కపటం లేని కబుర్లు చెప్పుకున్న
కాలాన్ని తిరిగి రప్పిస్తరా ?

సిందర వందర సిందుబాగోతాలను
ఆగమైన కళలను ఆవిష్కరిస్తరా ?
సినిమాలు తెచ్చి సిందు, దాసరి బతుకులను
బజారు పాలు చేస్తిరి గదరా ?

నలుగురి ఆకలికి మెతుకైన రైతన్న
నిరుటోల్ల మడి ఎండిపోయినట్టు
తనకే మెతుకు లేక కడుపెండి
కోళ్ళఫారాల బాట పట్టిన
నా తమ్ముల్లను తోలుకొస్తరా ?

ఈత పండ్లు తీనుకుంటూ
ఇసుకలో ఏరుకున్న గవ్వలను
కట్టుకున్న పిట్టగూళ్ళను
కనపడకుండా చేస్తిరి గదరా ?

మా నీల్లను దోస్తిరి, నిధులను దోస్తిరి
ఏకంగా నదులను, నౌకర్లను దోసి
తీరొక్క బాధల తోని తిప్పల వెడితిరి

మా తల్లి తెలంగాణ కోసం
మీరు చేసిన బాసలన్ని
"దింపుడుగల్లం" ఆశలాయె
మా బాధలన్ని బధిర శంఖారావం అయ్యే

మా ఓట్లను కొల్లగొట్టుకుపోయి
మా పాట్లను పట్టించుకోలేని
బహురూప రాజకీయాలు మాకొద్దు
మా బతుకులు మేమే బాగుచేసుకొంటం ...!







# తెలంగాణం సాదిద్దాం



కాముని సుధాకర్
సెల్ : 9440646521

స్వాతంత్ర్యం కావాలని స్వాతంత్ర్యం రావాలని
తెల్లదొరల కెదురు నిలిచి పోరాడిన తీరువోలె
తెలంగాణ కావాలని తెలంగాణ ప్రజలంతా
ఏకమై యత్నిస్తే వచ్చితీరు తెలంగాణ
పెండ్లిల్లో, అంగట్లో, ఆకిట్లో రచ్చబండ కాడ
యాడవడితె గాడ తెలంగాణ జై అంటూ
పిల్ల జెల్ల ముసలి ముతక విద్యార్థులు,
నిరుద్యోగ పోరగాల్లు
లొల్లిపెడితె ఒత్తదీ తెలంగాణ రాష్ట్రము
తెలంగాణ పది జిల్లాల్ (హై.న.ఖ. ఆ.మె.ని. మ.ర.వ.క.)
తెలంగాణే లక్ష్యంగా ఒకే పార్టి ఉండాలి
లేక అన్ని పార్టీలోల్లు కలిసి
తెలంగాణే ధ్యేయంగా ఐక్యంగా పోరాడితే
అహింసాయుధంతోనే అస్తుందీ తెలంగాణ
పల్లెలు, పట్నాలు, నగరాలు, నగారాలు మోగిస్తే
తెలంగాణ నినాదమే రణన్నినాదమై
జనం చెవులు రింగుమని మారు మ్రోగుతుంటే
నేటి తెలంగాణ పోరాటం - తీవ్ర ఉద్యమ రూపం దాల్చి
ధర్నాల్ సత్యాగ్రహాలతో గల్లి నుండి ఢిల్లీ వరకు
లొల్లి వెడితే ఒత్తదీ తెలంగాణ రాష్ట్రము
తల్లి పాలు తాగి రొమ్ము గుద్దు చందాన
తెలంగాణ వాసులే తెలంగాణ కడ్డమైతే
దుడ్డు కర్ర చేత బట్టి తెలంగాణ పొలిమేరలు
దాటువరకు తరిమి కొట్టి సాదిద్దాం తెలంగాణ.

# మంచిగ బోన్రి



**సార సురేష్**
సెల్ : 9505485272

మా అవ్వను బువ్వను ఎక్కిరిస్తిరి,
అన్నదమ్ముల్లని ఆగంజేసింది ఎవరు,
మాకొలువులు నెలవులు దోస్తిరి,
మీ దోస్తానంత దోసుడేనాయే ;
అక్షరాలు ఒక్కటే అని,
మా భాషను బద్నాంచేస్తిరి.
మా సింగరేణిని మీ సిగకెక్కించుకొని
మా బ్రతుకు చీకట్లేస్తిరి
కాలే కడుపుతో కాలేజి చేస్తే
పరీక్ష పేపర్లు పెయిల్ చేస్తిరి
ముల్కిని ముంచి నకిలీని దెస్తిరి
మా చేనేత చెయ్యి నరికి;
చందన్న బొమ్మలు కడ్తిరి
సాంబారు రుచులు తెచ్చి
మా నాయకుల సన్యాసుల చేస్తిరి
పట్నంల బడ్డ పందులోలె
కనపడ్డ మురికికాల్వలన్ని కబ్జాచేస్తిరి
బద్నామ్ జేసుడే తెలివిఅన్నట్లు
బెయిమాన్ తనం చెయ్యవడితిరి
కాయితాలల లెక్క చూపి;
తలకాయ తీస్కబోవడ్తిరి.





మీరు ఎన్ని బాధలు పెట్టిన,
తెలుగుతల్లి చూసి ఊకునే,
మా తెలుగునే తెలుగు కాదని,
మా చరిత్రనంత చదల్లబెడ్తిరి.
పచ్చల్ల బేరగాడు ప్రతిక బెట్టి,
పచ్చకామెర్ల రాతలతోని,
తిమ్మిని బమ్మినిచేసి తీట సూపిత్తిరి.
అమ్మపేరు మార్చెఅంత స్వామి భక్తితోని గూడ,
అందినకాడికి దోసుకొను సిగ్గుపడకపోతిరి,
కలిసి ఉంటె కుల్లబొడ్వవడ్తిరి.
వీడిపోదమంటే విర్రవీగి,
అన్నిమాయె అని అంగలార్చబడితిరి.
తిరుగేసి కొడితె బిడ్డాఆంద్రోడా !
నాటి తమిళ తంబికన్న తక్కువోల్లం కాదు
పొద్దు పొడిసే సరికే
పొమ్మనే రోజు దగ్గర బడ్డది
ఎల్లగొట్టలేక కాదు బిడ్డా !
మానవత్వమున్న బిడ్డలం మంచిగ బోంద్రి
గోస అందరికి ఒక్కటే
ప్రాంతాలుగా విడిపోయి
మనుషులుగా కలుద్దాం

# "తెలంగాణ రైతు బ్రతుకు చిత్రం"



రాయిని రాజిరెడ్డి
సెల్ : 9866224252

ప్రపంచములో అందరి ఆకలికి పరిష్కారం వాడు
కానీ.....
అతడే నేడు పాలకులకు సమస్య
అతని ఆకలే అందరికీ సమస్య
అదే తెలంగాణ బ్రతుకు చిత్రం
రైతన్న బ్రతుకు వింతగా మారిన విచిత్రం
పచ్చని వరహాలు పండిన అతని
పంట పొలములోనే నేడు పల్లేర్లు మొలిచాయి
ఎల్లిపారిన బాయిలో
జిల్లేల్లు మొలిచాయి
లేగదూడలతో కళకళలాడిన
పశువుల దొడ్లన్నీ
ఆత్మీయులు దూరమై అనాధలుగా ఉన్నాయి
అడుగుల సప్పుడు లేదు
ఆకలికోసం అరుపులు లేవు
అదే తెలంగాణ బ్రతుకు చిత్రం
రైతన్న బ్రతుకు వింతగా మారిన విచిత్రం
కాలం విసిరిన విచ్చుకత్తికి
పచ్చని సంసారం విచ్ఛిన్నమైనది
ఇత్తులు పండవలసిన నేలలో నెత్తురొడుచున్నది





తెలంగాణలో విరబూసిన మందారాన్ని అడుగు
మట్టితల్లి గుండెల కొండల్లో
నల్లబంగారపు సింగరేణి నడుగు
మెత్తని గుండెల్లో (కు)
అడుగుల ఆనవాళ్ళు ముద్రించుకున్న
తెలంగాణ మాగాణాన్ని అడుగు
ఒకప్పుడు....
రతనాలు పండించుకున్న నేల ఎవరిదని ?
ఎల్లిపారిన సంసారాలు ఎవరివని ?
కాలం సుడిగుండమైనా
కాపురం కష్టసాగరమైనా
బీడు భూమిలో
మోడువారిన జీవితపు శిలువను
భుజాలపై మోస్తూ
అప్పుల ముండ్ల కిరీటాన్ని
కొప్పులో ధరించిన కళియుగ ఏసు
మధ్యతరగతి మంటల్లో
ప్రభవించిన వాడొక ఎర్రకలువ



# స్వరాష్ట్ర కాంక్ష



వి.వి. కన్న
సెల్ : 8978751974

జనం జనం కదిలి ప్రభంజనం సృష్టిస్తే
గుండె గుండె రగిలి ఉప్పెనలా ఉప్పొంగితే
జయహో జై తెలంగాణ
జనం గీతి పాడుదాం
రణం జేయ కదులుదాం

నైజాము నెదురించిరనట్టి ఖజాన మనకున్నదని
కాకతీయ సామ్రాజ్యపు కళాకాంతులెక్కడని
రాజులు మారిన కొద్ది రోజులు భూజెక్కెనని
అలనాటి వైభవాన్ని ఇలలోన తేవాలని ॥జనం గీతి॥

పట్టెడు అన్నము కోసం కష్టమంతా జేసేటి
మట్టి మనిషి బ్రతుకుల్లో మరో చరిత్రను రాసి
శ్రమజీవుల హృదయాల్లో సమగంధం పూయాలని
ప్రత్యేక తెలంగాణ మా గానం ప్రాణమని ॥జనం గీతి॥

కదదప్పెను కులవృత్తులు కొడిగట్టిన దీపాలై
వాడిమాడిన బ్రతుకులు మళ్ళీ చిగురించాలని
తెలంగాణమంతా జనగాన మవ్వాలని
కదలాలి జనవాహిని కదంతొక్కి పదం పాడి ॥జనంగీతి॥

స్త్రీ జాతి ఔన్నత్యం సిరి సంపదగా తలచి
బలహీన వర్గాలకు బాసటగా నిలవాలని
సమాజాన ప్రతి ఒక్కరు సగర్వంగ బ్రతకాలని
ప్రజా తెలంగాణ కొరకు అడుగుల అడుగేసి కదిలె ॥జనంగీతి॥





అర్ధరాత్రి తొలిపొద్దై తెలంగాణ ప్రకటన సై
సమైఖ్యాంధ్ర వాదులంత సూడలేక ఓర్వకుంటె
కాలిన దేహాలతోని కండ్ల బడ్డ తెలంగాణ
అమర నెత్తుటి మరకలు సమరానికి సిద్ధమనే ॥జనంగీతి॥

యువత మేలుకోవాలి భవితను నిర్మించాలి
సమత మమత నవత కొరకు సైనికులై కదలాలి
తెలంగాణ నిర్మాణమె ప్రపంచానికాదర్శం
అదేరా అమరులంత కలలుగన్న స్వరాష్ట్రం ॥జనంగీతి॥



# నిజంగా....



వంగా గాలిరెడ్డి
సెల్ : 9391813526

నిజాయితిగా...
నువ్వూ - నేను
కలహము లేకుంటున్నామా !
కలిసి మెలిసివుంటున్నామా !?
తల్లీ బిడ్డల తీరుగనా !
పిల్లీ ఎలుకల తీరుగనా !?
ఆలుమగల తీరుగనా !
అ(బ్రకద(బ్రక తీరుగనా !?
రామలక్ష్మణుల తీరుగనా !
రావణ(బ్రహ్మ తీరుగనా !?
కొవ్వుబలిసి పొగరెక్కిన
పోకిరి పొట్టేలు తీరుగనా !?
చాకిరిలోను చతికిలబడిన
చితికిన రైతు తీరుగనా !?
దొంతులకుండ తీరుగనా !
దోభీఘాటు తీరుగనా!?
అడుగున వున్నది నువ్వా-నేనా... !
అగ్గిపెట్టినది నువ్వా - నేనా.. !?
నిజంగా.....
నిజాయితీగా నువ్వూ-నేను
కలిసి మెలిసి వుంటున్నామా!
కలహము లేకుంటున్నామా...!?





# జై తెలంగాణ... జై జై తెలంగాణ



పాతూరి విజయ
సెల్ : 8008556046

పల్లె మేలుకోవాలి (ప్రతి ఇల్లు మేలుకోవాలి
మహిళ మేలుకోవాలి మన తెలంగాణ రావాలి
వెన్నెలమ్మ వెన్నెల వెన్నెలమ్మ వెన్నెల

ఢిల్లిలున్న సోనియమ్మ మహిళకాదా
తెలంగాణ మహిళ బాధాతెలుసుకోదా ॥వెన్నెల, పల్లె॥

కన్న కడుపు గోస తనకు తెలిసిరాదా
విద్యార్థుల మరణాలు కనిపిస్తలేదా ॥వెన్నెల, పల్లె॥

మహిళలంత ముందుకొచ్చి పోరాడుదాం
మన తెలంగాణ ఎట్ల రాదో గర్జించుదాం ॥వెన్నెల, పల్లె॥

ఉద్యోగులు, విద్యార్థులు ఒక్కటయ్యినారు
మహిళలంత బోనమెత్తి నిలబడ్డారు ॥వెన్నెల, పల్లె॥

ఇక తెలంగాణ ఆపడం ఎవ్వరి తరము
మా తెలంగాణ వచ్చేదాక ఆపం గళము ॥వెన్నెల, పల్లె॥

పల్లె మేలుకోవాలి (ప్రతి ఇల్లు మేలుకోవాలి
మహిళ మేలుకోవాలి మన తెలంగాణ రావాలి॥వెన్నెల, పల్లె॥

# ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర పోరాటము



మొలుగు రామారావు
అడ్వకేట్
సెల్ : 9440529554

ఆంగ్లేయులు బాధపడిరి భారత్‌ను విడువలేక,
సీమాంధ్రుల దదేవిధము తెలంగాణ వీడలేక,
కలిసుంటే కలదు సుఖము సమైఖ్యవాద నినాదము
విడిపోతె బాగుపడును తెలంగాణ విధానము
భాష పేర ప్రాంతాలను కలిపించుట సాధ్యమా ?
వేరు వేరు రాష్ట్రాలను అతికించుట భావ్యమా ?
అన్నదమ్ములనుకొంటిమి కలిసుంటిమి కొన్నాళ్ళు
సీమాంధ్రుల పెత్తనము సహించలేము శాన్నాళ్ళు
వనరులన్ని దోచుకొందురాంధ్రవాదు లెప్పుడు
వరుసగ పాలించెదరు సీమనేతలందరు
నాలుగు పదులు దాటింది తెలంగాణ పోరాటము
ఆరునూర్లు దాటుతుంది అమాయకుల ప్రాణత్యాగము.
గాంధేయవాద నిరసనలకు తలవొగ్గిన కేంద్రము
తెలంగాణ యిస్తామని ప్రకటించెను తథ్యము
సీమాంధ్రుల సీనుచూసి బెదిరిపోయి కేంద్రము
శ్రీ కృష్ణుని సంఘమంటు వెళ్ళదీసె కాలము
ఆంధ్రవారి ఎత్తుగడలు ఆపలేవు ఉద్యమము
సీమవారి జిత్తులతో చెదిరిపోదు లక్ష్యము
ఆంధ్ర తెలంగాణాలు సహోదరులమనుకుంటె
విడిపోవుట న్యాయము వీడకుంటె అనర్థము
తెలుగుతల్లి తపనంత తన తనయుల క్షేమమే
విడిపోయి బాగుపడితె ప్రతితల్లికి సంతోషమే
తెలంగాణ వాదులుగా తెగించి పోరాడాలి
భరతమాత బిడ్డలుగా విజయ పథము చేరాలి
జై తెలంగాణ...          జై జై తెలంగాణ...





# మా మట్టి కోసం



సతీష్ లగిశెట్టి
సెల్ : 9848399314

ఇక్కడ పుట్టిన
ప్రతి బిడ్డ తెలంగాణవాదే...
బిగిసిన ప్రతి పిడికిలి
తెలంగాణ కోసమే...
పల్లెలు, పట్టణాలు ఏకమై
ఉద్యమ ఉప్పెనై ఎగసి పడుతున్నది...
ఆత్మబలిదానాలు చూసి చూసి
ఆత్మలన్ని రగిలి రగిలి దోపిడి గుండెల్లో పిడుగులైనాయి...
మా సహనం చేతకాని తనం కాదు
హద్దు దాటితే అగ్గికెరటమే....
భాష మూసలో భాగోతం
కబలించే సీమాంధ్ర భూతం...
అన్ని మావే అని అంటే
పిడికిల్లు పిడుగులైతాయి...
మీది ఒట్టి పోరాటం
మాది మట్టి పోరాటం...
తెలంగాణ తేలేదాకా
తెగించి కొట్లాడుడే...
జై తెలంగాణ !          జై జై తెలంగాణ !!

## సాగుదాం - ముందుకు సాగుదాం



బొందుగులపాటి
విజయకృష్ణ
సెల్ : 9393825764

తెలంగాణ తెలంగాణ తెగ తెంపుల సమరం
లేక పోతే బతుకనియ్యదు వలస పాలక సూకరం

ఉదాసీన వైఖరొదిలి ఉద్యమాల్లో పాల్గొందాం
ఉద్యమ ఊపిరిలూది యువతశక్తిని చాటుదాం
నేనొక్కడిననుకోకు నీటి బిందువొక్కటే కద
ఊర్లను ముంచెత్తె గంగ కూడా తల్లే కద !

శివమెత్తి పోరాడుదాం శివపుత్రుని వలె మనం
అడ్డు అదుపు లేదు మనకు అణ్వస్త్రం కావలెమనం

టి.వి ముందు, ఇండ్లలోన వీక్షించే పద్దతిని
ఉపేక్షించి ఉరికి-ఉరికి ఉద్యమించి సాగుదాం

ఆరొందల పది జీవో అపహాస్యం చేసినా
పెద్ద మనుషులొప్పందం గద్దలవలె చీల్చినా
ఆ చంద్రుడు (కె.సి.ఆర్) మన ఇంట్లో దీపాలను వెలిగించే
మరో మహాభారతం - మన తెలంగాణా సమరం

ఆత్మ బలిదానాలలో హారతి అయిపోక మన
ఆత్మగౌరవానికై ఆయుధాలు ఎత్తుదాం
మరో మారు మహాత్ముని మార్గంలో పయనించుదాం

స్వతంత్ర భారతావనిలో "స్వర్ణ తెలంగాణ"కై "సువర్ణ తెలంగాణ" కై
సాగుదాం.. సాగుదాం.. సాధించేవరకు సాగుదాం
సాధించి ముందుకు సాగుదాం





## జై బోలో తెలంగాణ



వంగ గాలిరెడ్డి
సెల్ : 9391813526

జై బోలో తెలంగాణ కు
జై జై తెలంగాణ
ఇది శంకర్ సినిమా కాదు
మా సిధారెడ్డి భూమి స్వప్నం
ఒక బాధ కాదు
తెలంగాణ బతుకు చిత్రం
ఆరవై సంవత్సరాల ఆత్రం
కాచి కాగడా పట్టి
వినిపించిన కంచుగంట
చిలికి వెన్న తీసిన చల్ల సారం
తెలంగాణ బతుకు బారం
ఇది పురిటి నొప్పుల బాధ
మతి చెలించెడి మనోవ్యధ
ఇది తెలంగాణ గోస చిత్రం
ఇది తెలంగాణ సమాజం దృశ్యకావ్యం
రామాయణంలో సీతారామాంజనేయులు యాదికొస్తే
ఇక్కడ మొత్తం తెలంగాణ మదిల మెదుల్తుంది
గోస ఎవడు పడుతున్నాడో
అరిగోస ఎవడు పెడుతున్నాడో
ఇట్టే తెలిసిపోతుంది
తెలంగాణ జనం ఎందుకు
తెగ పడ్తున్నారో అర్థమై పోతుంది
ఇది చూసిన తర్వాత ఎవడైనాసరే
తుపాకి ట్రిగ్గర్‌మీద వేలుపెడ్తడు
గురిచూసి కొట్టడానికి సిద్దపడ్తడు

అటులకానివాడెవడైనా ఉంటే
వాడు గోడకు వేసిన సున్నం కాదు పేడపిడక
చూడు చూడవే అక్కా అవ్వా చెల్లే
చూడాలేనె అన్నా అయ్యా నాయనా
బాపూ తమ్మీ చూడంఁడ్రా బాబు
చూసినవంటే నీకు నువ్వే ఒక వీరుడివై పోతవు
ఎక్కుపెట్టిన బాణమై ఎదురుగా ఉన్నవాడి
ఎదలో దూరిపోతావు
ఎడారిగా మారుతున్న తెలంగాణ కోసం
కరిగినీరై కన్నీటి కెరటమై ప్రవహిస్తావు
పల్లవిస్తావు పలవరిస్తావు జలదరిస్తావు
నవ్వునుమానేసి నువ్వే అందులో లీనమై
పోయి జై బోలోతెలంగాణ అంటావు
జై జై తెలంగాణ అంటావు
జై తెలంగాణ జయము కలుగాలని కలలు కంటావు
జై బోలో తెలంగాణ
ఒక సామూహిక సమ్మోహన
సమరగాన రుద్రవీణ
తొలకరిలో రైతుకోసం
భూమాత గుండె పొరల్లో నుండి ఉబికివచ్చిన ఆరుద్ర పువ్వు
సమైక్యంలోని విషపు మెలిక
విప్పి చెప్పిన విచిత్రం
స్వార్థంలోని మొండితనాన్ని చీల్చి చెండాడి
త్యాగంలోని ఆత్మీయత ఆలింగనం చేసుకొన్న
అర్థవంతమైన చిత్రరాజం
జై బోలో తెలంగాణం





# ఆరాటం



కె.వై. గిరి
సెల్ : 9652859356

ఆంధ్రప్రదేశ్ - భాషాప్రయుక్త రాష్ట్రం
ఆంధ్రప్రదేశ్ - అవతరించిన
అప్పటినుండి ఇప్పటిదాకా - కీలకమైన నిర్ణయాలు
కీర్తినొందే పదవులెన్నో - ఆంధ్రాప్రాంతీయులవే
ఈ అన్యాయంలో - ఈసురోమని
తెలంగాణ ప్రజలంతా - జావగారి పోయారు
బలిపశువులు అయ్యారు
ఆంధ్రనేతల కుచ్చితబుద్ధికి - కుంచించుకుపోయారు
మనసు నొచ్చుకు ఒరిగారు
ప్రకృతి వనరులు ఎన్ని ఉన్నా
ప్రయోజనం లేని తెలంగాణ - సాగునీటికి, తాగునీటికి
ఖచ్చితంగా - కరువే - కరువు
సానుకూలం కావాలంటే - ఎన్ని ఇక్కట్లైనా ఎదుర్కొని
సాహసిస్తేనే సానుకూలం - అందుకే
మనమందరం కలిసిమెలిసి
అన్ని వర్గాల ప్రజలమంతా
బాధలెన్ని భరించైనా - తెలంగాణ తెచ్చుకుందాం
అంతదాక అనంతంగా - సాగిద్దాం పోరాటం
ఇదే కావాలి
అందరి ఆరాటం - మనమంతా ఒక్కటైతే
రాదెందుకు తెలంగాణ - ఒక్కటై గొంతెత్తి చాటాలి
జై తెలంగాణ - జై జై తెలంగాణ

# సునామి



**మఠం చంద్రమౌళి**
సెల్ : 9704627894

నా తెలంగాణ గర్జిస్తున్నది
నా తెలంగాణ హుంకరిస్తున్నది
రంగుల హంగుల్లోన
రాజిస్తూనే ఉన్నది
నివురు గప్పిన నిప్పువోలె
తెలంగాణ రగులుతున్నది
సునామి కెరటాలవలె
నింగికెగురుతున్నది
రైతుల, కార్మికుల, మేధావుల
గుండెలు మండుతున్నవి
నాటి నుండి నేటి వరకు
జరిగిన అన్యాయాలను
అక్రమాలను దోపిడీలను
ఆక్రందనలై ఘోషిస్తున్నాయి
ప్రత్యేక తెలంగాణ
కావాలని కదం తొక్కుతున్నది
నాల్గున్నర కోట్ల ప్రజల ఆరాటం
తెలంగాణ ఆత్మగౌరవ పోరాటం







# మాకొద్దు ఆంధ్ర పెత్తనం



**నార్లపురం రాములు**
సెల్ : 9866008319

మాకొద్దీ ఆంధ్రాపెత్తనం దేవ
మాకొద్దీ ఆంధ్రాపెత్తనం
మా నీళ్ళన్ని హరియించి
పొలాలు బీళ్ళుంచే ॥మాకొద్దీ॥

పదియును జిల్లాల్లో, నదులు పారుచున్నా
పట్టెడన్నమే లోపమండి
నీళ్ళుముట్టుకుంటే శాపమండి
నోట మట్టిగొట్టి పోయారండి
ఈ ఆంధ్రతొత్తులతో పోరాడుతామండి ॥మాకొద్దీ॥

భాషాప్రయుక్త రాష్ట్రాలుఅని
వారుబంధుత్వమును గలిపినారు
తెలంగాణోల్లే బంధువులన్నారు
తెలుగువాళ్ళంత ఐక్యమన్నారు
హైద్రాబాద్‌ను ఆక్రమించారు
సంపదనంత పెంచుకున్నారు
తెలివితేటలు కనబర్చి తీటకయ్యముజేసే ॥మాకొద్దీ॥

ఉపముఖ్యమంత్రి పదవన్నారు
ఊదరగొట్టె ప్రకటన చేశారు
ముల్కిరూల్స్ పాటిస్తమన్నారు
మీఉద్యోగాలు మీకన్నారు
ముద్దుముచ్చటలెన్నో జెప్పారు
కీలకొద్యోగాల్లోజేరి మాకీల్లు విరిచేటి ॥మాకొద్దీ॥

పెద్దమనుషులొప్పందమన్నారు
అమలుకానట్టి హామీలిచ్చారు
అన్నీ తుంగలో తొక్కేశారు
అందుకే ఉద్యమించాం మేము
తెలంగాణ సాధించేవరకు
తెగువతోనే పోరాడుతాం
తెగేదాక లాగితె కదులుతాయి పీఠాలు ॥మాకొద్దీ॥

ఛీ పొమ్మని ఛీ కొట్టినగానీ
జొర్రీగాలవలె పట్టుకొని
మా రక్తాన్ని త్రాగుతున్నారు
మమ్ములరి గోసపెడుతుండ్రువారు
మానవత్వంలేని మహా మోసగాండ్రయ్యా ॥మాకొద్దీ॥







# నా తల్లి తెలంగాణ



ఆలాజ్‌పూర్ కిషన్
సెల్ : 9908708809

తల్లి తెలంగాణా ఏం కలగంది ?
బిడ్డలెవరి కళ్ళల్లో కన్నీరు చూడనంది
కండ్లేమన్నాయి?
కళ్ళల్లో వెయ్యి సూర్యుళ్లను దాచమన్నాయి
సూర్యుడేమన్నాడు?
సముద్రమై హోరెత్తమన్నాడు
సముద్రమేమంది?
విశ్వమంతా ఒకే నినాదమై ధ్వనించమంది
తల్లి తెలంగాణ ఏమంది?
తారవై ఆకాశానికి తాకమంది
ఆకాశం ఏమంది?
వర్షమై నేలపై కురవమంది
ఈ నేల ఏమంది?
మరణించిన వీరుని రక్తం తన నుదుటి పై దిద్దమంది
వీరుడేమన్నాడు?
తల్లి కడుపులో మళ్ళీ జన్మిస్తానన్నాడు
ఆ తల్లి ఏమంది ?
నా బిడ్డకు మరణం లేదంది
తల్లి తెలంగాణా ఏమడిగింది?
ఆరణ్యమై విస్తరించమంది
అరణ్యం ఏమంది ?
యుద్ధ భూమిపై జీవించమంది
యుద్ధ భూమి ఏమంది?
ఆయుధం ఇచ్చి సాగనంపింది
ఆయుధం ఏమంది?
శత్రువు గుండెల్లో పేలమంది

# తెలంగాణ ఐక్యత



బొద్దుల పుండరీకము
సెల్ : 9032488547

సీ॥ తెలంగాణ కాంక్షించి తెగబడి విద్యార్థు
లెందరో ప్రాణాలనిచ్చినారు
తెలంగాణ కాంక్షించి తెగి మన నాయకులు
రాజినామలు చేసి రగిలినారు
తెలంగాణ కాంక్షించి బలముగారాజ్యాధి
కారులందరు చేరిపోరినారు
తెలంగాణ కాంక్షించి ధీరసజ్జనులంత
ఉద్యమించి ముందుకురికినారు
తెలంగాణ కాంక్షించి ధీమతోడను వృత్తి
సంఘనాయకులు నుప్పొంగినారు
తెలంగాణ కాంక్షించి నిలిచి మహిళలంత
బతుకమ్మపాటలు పాడినారు
తెలంగాణ కాంక్షించి తెగలు లెక్కించక
అందరూ ఒకటౌచు అలరినారు
తెలంగాణ కాంక్షిచి దిగులింతయులేక
పోలీసు దెబ్బలతొ పొరలినారు
తెలంగాణ కాంక్షించి పులులుగా జడియక
కారాగారములకు చేరినారు
తెలంగాణ కాంక్షించి తిప్పలనుభవించి
వైద్యోపాధ్యాయులు వరలినారు

తే॥గీ॥ ఊరు పల్లెలు వాడలు ఒక్కటేమి
పట్టణములు తండాలలో బ్రతుకు ప్రజలు
అందరూ తెలంగాణకై ముందుకురికి
త్యాగములకు సంసిద్ధులయి తరలినారు





# కదం తొక్కిన తెలంగాణ



డబ్బికార్ సురేందర్
సెల్ : 9618789598

ఊసుకండ్లోనికి పాసుపండ్లోడన్నట్లు
చిదంబరానికి శ్రీ కృష్ణతోడు
ఆడి తప్పిండు ఒక్కడు!
అన్ని తెలిసి ముంచిండు ఒక్కడు
గాందీ కే బొంది జూపించిన
కాంగ్రేసుకు ఇది ఒక లెక్కనా ?
నెహ్రూ నుండి సోనియా దాక
పచ్చి అబద్ధాల పచ్చిస
ఓట్ల దాక ఓట్ల మల్లన్న
ఒటైనంక ఒంటి మల్లన్న
మాటలు మూటగట్టి
మూతులు ముడుసుకున్నరు
కాకి కవాతు తోనే
కాలాన్ని దున్నేయ సూత్తే
వేయి గొడ్ల తిన్న
రాబందు తీరుగ
వచ్చె ఓట్ల వర్షంలో
కొట్టుకపోతరు బంగాళఖాతంలో
మా పిల్లల పీక్క తిన్న పాపం
మీరు మట్టి కరిసెదాక పోదు
వేలమంది అమరుల సాక్షిగా
మా ఓపిక నసించింది
మీ పెద్దరికం బద్దకం జేస్తే
మా హద్దు బద్దలైతది

ముల్కి ఇరిసినప్పుడే - ముక్కుపిండినాం
ఇమానం తప్పింద్రని - ఇజ్జత్ తీసినాం
610 జి.వో. ఆరుజోన్ల - ఆగం జేస్తిరి
దొరికిన దొడ్డి జాగ - దోపిడి జేస్తిరి
మీ ఇంటికి రోడేసుకుని - మా ఇంటికి రంగేసి
అది ఇది మాదే అంటిరి
హైద్రాబాద్ అభివృద్ధి - మీ అయ్య జాగిరైనట్లు
అరిసి గోల జేయవడ్తిరి
కూలిపోయే దారులేసి - కూలిడబ్బులు దండుకుంటిరి
సిమెంటు బంగ్లే సింగారమైనట్లు
బొంతపురుగులై బొర్లవడితిరి
మీ కమీనే ఇకమత్
ఇకముందు సాగనే సాగదు
ముసాఫిర్ అని సఫర్‌జేస్తే
నీల్లు, నిదులు, సదువులు
కొలువులు, నెలవులు, కుదువలు
కొల్లగొట్టి గోల్‌మాల్ జేస్తిరి
రమ్మన్న పాపానికి రాబందులైతే
పోకుంటే ఊకుంటామా?
పొలిమేర దాక పొర్రించి కొడుతాం
కదం తొక్కిన తెలంగాణం
ఊరు వాడ ఏకమై
ఉప్పొంగిన జనసంద్రమైతే
తెలంగాణ రావాలి ఈ తాపకే
జై తెలంగాణ, జై జై తెలంగాణ





# ఇవి హత్యలే



తోట అశోక్
సెల్ : 9440039993

కత్తులు దిగవు
కుత్తుకలు ఎగరవు
బుల్లెట్స్ దూసుకుపోవు
రక్తధారలు పారవు
కానీ....
ప్రాణాలు పోతాయి
ఇంటి దీపాలు ఆరిపోతాయి
నిలువెత్తు ఆశను...
నాటకాల మంటలు కాల్చేస్తాయి
ధైర్యానికి...
కపటపు వురితాళ్ళు బిగుస్తాయి
విశ్వాసాన్ని....
విషం మాటల గుళికలు మింగేస్తాయి
ఇవన్నీ....
నిరాశవాద ఆత్మహత్యలంటారు
కానీ...
ఇవి ముమ్మాటికి ఆంధ్రా పెత్తందార్ల హత్యలే
ఇప్పుడు...
వేణుగోపాల్ లేడు.... యుద్ధగానం వుంది
శ్రీకాంత్ లేడు.... పౌరుషాగ్ని మండుతుంది
పర్శరాములు లేడు... విడిచిన గొడ్డలి వుంది
శ్వేత లేదు... ఉద్యమ సాధముంది
వీరులను వేరు చేసావే
కానీ వీరత్వం ఉప్పెనలా రగులుతుంది
హంతకులకు, ద్రోహులకు శిక్షలు తప్పవ్
అమరులకు రాష్ట్ర స్వప్నం
సిద్దించక తప్పదు

# ఏలుకుందాం...!



జీడిపల్లి కమలాకర్‌రావు
సెల్ : 9704712480

తెలంగాణ మనదిరా
కరువు రాజ్యమేల అయ్యెరా
ఈ కరువురాజ్యానికి కారణం
ఆంధ్రవలస వాదమేరా
నాలుగుకోట్ల గొంతుకలేకమైనాయి
ఆంధ్ర వలస వాదుల ఆగడాలపై
తెగించి పోరాడుదాం వీరుడా !
పొత్తుల షరతు చెరిగిపోయె
నీల్లు నిధులు ఆంధ్రకే పారె
ఈపొద్దు తెలంగాణ పోరుకు
విద్యార్థి లోకమంత కదిలింది
తెలంగాణను అడ్డుకున్న
ఆంధ్ర ద్రోహుల తన్ని తరమాలి
కల్లబొల్లి కమిటీలు కాలయాపన
కపట కాంగ్రెసు ఆడె నాటకం
ఇంకానా ఇకపై చెల్లబోవు
ప్రభుత్వాలే మాటతప్పితే
పతనంకాక తప్పదు
తెలంగాణ పోరుకు ఊరు వాడ కదిలింది
మన తెలంగాణ సాధిద్దామనే
మన తెలంగాణ మనమే ఏలుకుందాం అని
కదం కదం కదిలిరాగ ఊరువాడ ఏకం కాగా
తెలంగాణకై తెగించి పోరాడుదాం... !







# భరోసా...!



పొన్నాల బాలయ్య
సెల్ : 9608906248

మాది ప్రాంతీయ మత్తుకాదు
పాంచ్ రాస్తాల కత్తి మొనల మీద
నెత్తుటి మడుగుల గాయాలతో
నడుస్తున్న శిరస్సు
గుండె చిల్లులువడి
కరకర రక్తం కాల్వలై పారుతాంటె
కుర్చీ మూగదై తుపాకులు గర్జిస్తున్న నేల
హలం, కలం, గళం దమ్ముదీసుక
దుమ్ము దుమ్మై దమ్ముజూపే సమరం
అయ్యా ! ఓ తెలుగోడా !
ఇక్కడ నువ్వు భద్రమే,
నీ భాష భద్రమే
భరోసా లేనిదల్లా మాబ్రతుకులకే !
మూడడుగుల భూమిని
దానమిచ్చే అమాయక
చక్రవర్తులజేసి
ఈ నేల యెదను పిండి పచ్చిపుండు జేస్తూ
నరమేధ యాగాలతో
సరిహద్దుల్లేని సామ్రాజ్య నిర్మాతలే
మా శత్రువులు!
బుడిమెకాయల దొంగంటే
బుజాలు పునికి చూసుకున్నట్లు
ఇన్నేండ్ల సందిలేంది
ఇప్పుడెట్ల భయంబుట్టె బిడ్డా !

కులం, మతం గాక
ప్రేమకు పట్టాభిషేకం గట్టిన షహర్ !
అలయి బలయి దీసి ధూలా ఆడిన జమీన్ !
సొంగరొట్టె, మలీద ముద్దను కలిసి తిని
హిందూ ముస్లింలు ఇరానీ చాయ్‌ను
ఇష్టంగా తాగిన నేల
మత సామరస్యానికి
మొగులును ముట్టే గోల్కొండ!
పొట్ట నెత్తిన పెట్టుకొచ్చిన అన్నార్తులకు
మా యెత్తు తంగేళ్ళు తలవంచి నీడనిచ్చినయ్
గండిపేట నీళ్ళు
నాతో పాటు నీ దూప దీర్చినయ్
నడిబొడ్డున చార్మినార్
నాలుగు చేతులు చాచి దోస్తీ గట్టింది
మక్కా మసీదు పావురాలు
మన స్నేహం కోసం దువాచేసినయ్
ఆత్మగల్ల హైద్రాబాద్ భూములన్ని
సంకల పెట్టుకుంటివి
కొడిదెడు మట్టిని దీసి
ఎప్పుడైనా వొంటికి పూసుకున్నవా?
సేపోయి కొడుకా !
తెలు'గోడ' గట్టి
మా దేశ భక్తిని ప్రశ్నిస్తే
మా భూమ్మీద ప్రమాణం జేసి
ప్రతిజ్ఞజేస్తున్నం





భారతదేశం మా మాతృభూమి!
భారతీయులందరు
మా సహోదరులు !
దేహంలో శిరస్సు భాగమే !
దేశంలో ఈ నేల భాగమే !
నీకు మాకు పేరు ఖాయమే !
మేమెందుకు విడిపోవటానికి
శరీరంమీద పెట్రోలు పోసుకొని
సత్యాగ్రహిలమైనం?
ఆత్మహత్యలనాపి
ఆయుధాలు ధరించి
సాయుధులం గాలేమా?
మా మనసు లోతుల్లోకి వేలుపెట్టి కెలికితే
వెన్నతడి ఊదలూరే కన్నతల్లి గన్నది



# రాతి సింహాసనం వైపు



తైదల అంజయ్య
సెల్: 9866862983

సూదిమొన మోపినంత నేలను కూడా ఇయ్యనన్న
దుర్యోధనుడు కుప్పకూలిన తర్వాత కూడా
రాతి సంహాసనం మీద కూర్చున్న కీలుబొమ్మ గుడ్డిరాజు
ధృతరాష్ట్రుడు ఇంకా నన్ను రమ్మంటున్నాడు
విషపు కౌగిలిలో సమైక్యంగా వుందామని !
రాజ్యం పడగవిప్పిన నాలుగో తలలోంచి కోరలు చాచి
శ్వేత పత్రాల మీద నల్లటి విషపు ధారలు కక్కుతున్నది !
తెలుసా ! ఎవడబ్బసొమ్మనీ కులుకుతూ తిరిగేవని
రామున్ని ప్రశ్నించింది ఇక్కడి జైలుగోడలనుంచే !
ఈ నేలపై నడిచే ఏ శ్రీకృష్ణుడైనా ప్రబోధించేది
మనిద్దరి మధ్య వుండాల్సిన 'గీతా'సారాన్నే !
నువ్విప్పించింది మాత్రం రాష్ట్రక్షేత్ర రణరంగంలో
రాజకీయ నాటకపు పచ్చి కమర్షియల్ బ్రేక్ !
ఇగ జంటనగరాల్లో మనిద్దరి జంట కలువని లెక్కే తమ్మీ !
ఒక కోటి విద్యలు కూటి కొరకైతే
నాలుగు కోట్ల పిడికిళ్లు తెలంగాణ కోసం !
మమ్ములను మనస్తాపానికి గురిచేసి
ఆత్మ హత్య చేస్తావేమో గానీ
మా కలలను చంపే ఆయుధమింకా పుట్టలేదు !
నువు కొత్తగ చెప్పుడేంది ?
మేమున్నది ఆంధ్రప్రదేశ్ లో కాదు అండమాన్ జైల్లోనే!
మా వూళ్లకు తిరిగొచ్చినపుడల్లా
ఈ నగరం నుండి మేమెన్ని సార్లు గాయపడి రాలేదు ?
నువు పొత్తు పేరుతో మా ట్యాంక్‌బండ్ మీదికి రాక,ముందే
ఆ తెలుగు తేజాలనే మేమ నెత్తికెత్తుకున్నం





ఇటు చూస్తే అసమతుల్య ఆరాధన నీతి
అటుచూస్తే మా దుఃఖం కుతకుతా ఉడికే హుస్సేన్‌సాగరం
దశాబ్దాలుగా గూడుకట్టుకున్న మా ఆవేదనాగ్రహం
ఆరోజెందుకో కట్టలు తెంచుకున్న ఉప్పెనైంది.
అవును! మేం గుండెను రాయి చేసుకున్నం
నువు పన్నిన లోహ వలయాలను దాటి
ప్రాణాలు రాలినపుడల్లా మా కడుపులు కాలి కూలినపుడల్లా
వేయి శవాల ముందు బొచ్చెలు గుద్దుకొని గుద్దుకొని
మా చేతులు కరడుగట్టిన రౌద్ర హస్తాలైనయ్
అమాయకుడా! ఆగ్రహమెపుడూ విగ్రహాలమీద కాదురా !
వినిపించుకోని విగ్రహ స్వభావం మీద !
మా సుదీర యాత్రలో నువు పోట్రాయివని
తెలిసే నిన్ను పెకిలిద్దామనుకున్నది !
దొంగ సోపతిని ఎంతకాలం మోస్తం
మోసేంత సేపు మోస్తం మోయనపుడు ఎత్తేసుడే !
పూలు జల్లిన దేవున్నే బిడ్డలు కండ్ల ముందు
నిలివెడు మంటల్ల రక్తతర్పణం చేసినపుడు
వానిగుళ్లె రాళ్లువడ అనిశపించే అసలైన ధర్మాగ్రహం మాది!
రావలసింది రాకుంట జేసినపుడు
జరుగగూడని వన్నీ జరుగుతుంటయ్ ! అదంతే
కుటిల రాజకీయ ఇనుప ముఖాల మీద ఇగ ఉమ్మేసుడే!
మా బాధలు కనబడని తెల్లమొసల్ల కండ్లల్లింత దుమ్మేసుడే !
చూస్తావుండు !
మునుముందు జరిగే లాంగ్ మార్చ్
ఇగ నీ రాతి సింహాసనం వైపే



# తెలంగాణ వస్తేనే...



పెందోట వెంకటేశ్వర్లు
సెల్ : 9440524546

భాష ఒక్కటని
బందించిరి తెలంగాణను
సీమాంధ్రులు గడుసుగ
కేంద్రం సరేననగా !

ఒప్పందాలతో ముడిపెట్టి
చర్యలెన్నో జరిపినట్లుగా
సంతకాలు చేసినవారే
తుంగలోన తొక్కిరి

నీల్లన్ని మలుపుకొని
ఉద్యోగాలన్ని కొల్లగొట్టిరి
భూములన్నీ కాజేసిరి
తెలంగాణనే మింగేసిరి

కుంబకర్ణునిలా ఎంతతిన్నా
సాలక పోయే! సీమాంధ్రునికి
ఉనికి కూడ పోయెకాలమొచ్చె
తెలంగాణ లేచింది రాముడిలా !

విల్లంబులుచేపట్టిన వీరకిశోరంలా
ఉద్యమబాటలో నిలిచి
సాధన దిశగ నేడు
కదులుతుంది తెలంగాణ

ఆత్మాభిమానాన్ని
స్వంతపాలనను
కావలంటు యువకులు
విద్యార్థులు జేఏసిలు
చేయిచేయి కలిపి
పిడికిలి బిగించారు

గజగజ వణుకుతున్నది
సీమాంధ్రులు అయినా
గోమారుగ పట్టుక వేలాడుతున్నరు
శ్రీకృష్ణ కమిటి ఒట్టిదాయె...
తెలంగాణ వస్తేనే
ఉద్యమం ఆపుదాం...

❊ ❊ ❊





# ధర్మ పోరాటం



అమ్మన చంద్రారెడ్డి
సెల్ : 9948936083

సీ.మా. చూడుము సోదరా! నేడు ఈ తెలగాణ
మండుచు రగిలెను గుండె పగిలి
నైజాము పాలనన్నలిగిన తెలగాణ
పోరాడి గెలిచిన పురిటిగడ్డ
చవి చూడలేదురా! శౌర్యాగ్ని తెలగాణ
అరువది తొమ్మిది మరచినార?
ఓరి దుర్మతులార! ఒప్పంద తెలగాణ
తుంగలో తొక్కిన దొంగలార!
ఫజలలీ కమిటీల నిజమైన తెలగాణ
ఆరుసూత్ర పథకమాశజచ్చె
గోదారి, కృష్ణమ్మ గురుతున్న తెలగాణ
నీళ్ళుపారక నేల బీళ్ళునయ్యె
విజ్ఞాన కుసుమాల ప్రాజ్ఞుల తెలగాణ
ఉద్యోగముల్దోయ ఉసురుదగులు
ఓయు కేయూ టీయు ఓరిమి తెలగాణ
ఉద్యమ జ్వాలలనుడుకుచుండె
పల్లె పల్లె కలిసె పటిమితో తెలగాణ
రాస్తాల ధర్నాల రౌద్రమయ్యె
వద్దురా పొమ్మంటె హద్దు మీరడమేమి?
సీమాంధ్ర నేతలు సిగ్గు సిగ్గు

తే.గీ. తల్లిదండ్రుల కడుపులు తరిగిపోవ
వేణు శ్రీకాంతు బలిదాన విప్లవమ్ము
మిగుల తమ్ముల మనముల సెగలు రేగ
నివురు గప్పిన బడబాగ్ని నిప్పుకణిక

తే.గీ. బ్రతికి చెడిన పోర్బిడ్డలు బయలుదేర
మాతృ రాష్ట్రమ్ము రక్షింప మహిత ఘడియ
ఖ్యాతి నిల్పుడీ తెలగాణ కేతనమ్ము
అమర విద్యార్థులార జోహారులయ్యా









# లక్ష్యసాధన కోసం



పప్పుల రాజిరెడ్డి
సెల్ : 9652215043

దీపం పక్కన నీడలాగ
మ్యాచ్ బాక్సులో పుల్లలాగ
అమాయకంగా అనాథగా ఒంటరిగా
కాచుకొని కూర్చుంటుంది
ఆలోచనల తీగల వెంట
దొంగచాటుగా ప్రవహిస్తుంటుంది
ఆవేశంలో ఆవహించటానికి
నానా తంటాలు పడుతుంది
పసిగట్టావోసరే పక్కకు తొలగుతుంది
ఉచ్చులో చిక్కినవారి వూపిరంటే
దానకెంత ప్రాణమో
ఉద్యమం ముఖ్యమైనదే
జీవితం విలువైనది కదా !
కష్టాలూ కన్నీళ్ళు ఒత్తిళ్ళు
కలిమిలేములు పడిలేవటాలు లేచిపడటాలు
సాధనలో సామాన్యమే
నింపాదిగా గడపాల్సిన జీవితాన్ని ముక్కలు చెయ్యకు
అమ్మానాయినల కలలను తుంచెయ్యకు
పోరాటానికి వూతం అవుతూనే
ద్విగుణీకృత ధైర్య కాంతితో నిలబడి
ప్రాణం గడ్డిపరక కాదు
సముద్రమంత ఆశ
విస్తరిస్తూ విస్తృతమౌతూ సాగటమే లక్ష్యం

# ఆయుధపూజ



కలకుంట్ల రంగాచారి
సెల్ : 9553586159

విరాట పర్వం ముగిసింది....
సైనికులారా ఇక కురుక్షేత్ర సంగ్రామానికి
సిద్ధంకండి....
ఆయుధపూజ చేసి
జంబిచెట్టుపై దాచిన ఆయుధాన్ని దించి
భుజాలకెత్తుకోండి...
హస్తినలో ధృతరాష్ట్రుడు ఫిడేలుపై
మన్మోహన రాగాన్నే వాయిస్తున్నడు
'సోనియా గాంధారి' కళ్ళకు కట్టుకున్న
గంతలు ఇంకా విడవనేలేదు
చిదంబరుడు ఇంకా మీన మేషాల
లెక్కింపులోనే తలమునకలై ఉన్నడు....
రహస్యాన్ని బయట పెట్టేదెన్నడో
అదేం చోద్యమో.... అదేం విచిత్రమే....
అర్ధరాజ్యమిప్పిస్తానని రాయబారానికి వెళ్ళిన
శ్రీ కృష్ణుడు బేరానికి మొగ్గి
కౌరవవుల పంచన జేరిండు
సైనికులారా ఇక ఆయుధాలకు
పదును పెట్టండి...
అర్జునా.... సవ్యసాచీ...
అంతా మనవాళ్ళే కదా అని
ఆయుధాన్ని దించితే
గీత బోధ చేయడానికి
శ్రీకృష్ణుడు ఇప్పుడు మనదిక్కులేదు





సర్వసైన్యాన్ని ముందుండి నడిపించి
అభిమన్యునివై పద్మవ్యూహాన్ని ఛేదించాలి
కొమురంభీం లమై శత్రు గుండెల్లో
ఫిరంగులు మోగించాలి...
సమ్మక్క సారక్కలమై
చాకలి ఐలమ్మలమై యుద్ధ శంకం పూరించండి...
దొడ్డి కొమురయ్య, బందగిల వారసులారా
జంగ్ సైరన్ మోగించండి...
ఏకలవ్యులమై దారికి అడ్డువచ్చే
కీచకుల్ని.. సైంధవుల్నీ అడ్డుతొలగించండి...
ఇచ్చేది, తెచ్చేది మేమేనని ప్రగల్భాలు పలికే
'ఉత్త' రాకుమారుల్ని ఉరికించి ఉరికించి కొట్టాలి
'రెండు' కళ్ళని చెప్పి ఒకే దిక్కు చూస్తున్న
'పచ్చ' కామెర్ల నాయకుల్ని
పంచెలూడగొట్టాలి
సైనికులారా..! ఇక సమరానికి సమాయత్తం కండి
దాశరథి, కాళోజీ, వట్టికోట వారసులారా
వలసవాదుల కుట్రలపై కలాన్ని , గళాన్ని సంధించండి...
సురవరం, మగ్దుం, గులాం రసూల్ వారసులారా
కలం కవాతుచేసి సమరభేరి మోగించండి...
సైనికులారా.. మన రాజ్యం విముక్తి కోసం
కురుక్షేత్ర సంగ్రామానికి సిద్ధం కండి
ఆయుధపూజ చేసి జంబిచెట్టుపై దాచిన
ఆయుధాల్ని దించి భుజాలకెత్తుకోండి....



# మేరా తెలంగాణ



యం.డి. ఫసియొద్దీన్
సెల్ : 9885689808

జై తెలంగాణ  జై జై తెలంగాణ
జై బోలో తెలంగాణ

సునోజీ మేరా గాన
ఉర్దూమే ఇస్‌కో లిఖ్‌నా
తెలుగూమె సమజ్ జాన
హిందీ మేరా తరాన
నాతల్లి తెలంగాణ ॥జై॥

తెలుగు హమారి భాష
భాషల్లో తెలుగు లెస్స
ఆంధ్రాకి భాష హైనా
కంకర్‌కి భాష హైనా ॥జై॥

రహీమ్ భాయి ఇదర్ ఆవో
రామయ్యా ఇదర్ ఆవో
దునియాకి ఖబర్ దేకో
ఇస్‌మే హై తెలంగాణ
హమ్ లాయే తెలంగాణ ॥జై॥

ఇస్టేట్ ఏక్ బనానా
తెలంగాణ బనాదేనా
ఉర్దూ జబాన్‌కో రఖ్‌నా
దూస్‌రా దర్జా ఇన్‌కోదేనా ॥జై॥





మా తల్లి తెలంగాణ
హేలాన్ హమ్ కరానా
పోలీస్ సే నహీ డర్‌నా
హిమ్మత్ సే కామ్ కర్‌నా
హర్తాల్ ఖూబ్ కర్‌నా
గిరఫ్‌దార్ తుజ్‌భాతో చుడానా ॥జై॥

ఫసీకి షాహిరిమే
గౌస్‌సాబ్ కి రహబరిమే
దునియాకో సునాదేనా
హమ్ లాయే తెలంగాణ
మా పల్లె తెలంగాణ
మా తల్లి తెలంగాణ ॥జై॥



# వీ వాంట్ తెలంగాణ



యం.డి.
గౌస్‌మొహియొద్దీన్
సెల్: 9866296795

తందాన తన్ తాన - వీ వాంట్ తెలంగాణ
ఖుద్ ఆప్‌కి బీవిబి
చాహతీహై తెలంగాణ ॥తందాన॥
అజి ఆప్‌సే అఖల్‌మంద్ హై
ఆప్ కా జనాన ॥తందాన॥
రోషయ్య చలెగయే
కిరణ్ ఆగయే ॥తందాన॥
అబ్ చీఫ్ మినిష్టర్ కిరణ్ కుమార్‌రెడ్డి కో
దోకామ్ రహగహే హై ॥తందాన॥
దే దేనా తెలంగాణ
ఔర్ ఘర్ కో చలే జాన ॥తందాన॥
చెప్పన్ (56) బరస్ చలేగయా
అబ్ నహీ చలేగా అండి? ఏమండి? ॥తందాన॥
అబ్ జాగ్‌గయే దేకో
సబ్ వీర్ తెలంగాణ ॥తందాన॥
బిగ్‌గయే తుమ్‌హారే భాహెద్
చంద్ కౌడియోంకే బద్‌లే ॥తందాన॥
లేనా హిసాబ్ ఉన్‌సే తుమ్
అప్‌నా ఏక్ పురాణ ॥తందాన॥
మాసూమ్ షహీదోంకే
ఖూన్‌కి కసమ్ తుమ్‌కో ॥తందాన॥
యాజాన్‌సె మర్‌జానా
యా లేనా తెలంగాణ ॥తందాన॥





# వివక్షతాధిక్కార జీవన సమరం నా తెలంగాణ



— రుస్తుం
చిత్రకారులు
సెల్ : 9440395537

అణచబడ్డ భూమిలోనే
ఉప్పెనలా కదులుతున్న
దగాపడ్డ తెలంగాణ
తిరగబడ్డ తెలంగాణ
అలుపెరుగదు పోరాటానికి
మోకరిల్లదు పరాయివాడికి

పూటపూటకోమాట
తెలంగాణతో సయ్యాట
రాజకీయ దొంగాట
ఏ పూటకాపూట పొత్తు
స్వార్థ నాయకుల ఎత్తు
జనం మోసాలతో చిత్తు
వివక్షతా అణచివేత
దోపిడి దుర్మార్గం
అటాంకార పన్నాగం
వివక్షతా నాయకత్వం
నిరంకుశం అధికారం
తెలంగాణ అస్తవ్యస్తం
దిక్కులన్ని పెక్కటిల్ల
పార్టీలన్ని ఒక్కటయ్యె
జెఎసి పుట్టుకొచ్చె

ఊరూర పోరు
ఇంటిల్లిపాది హోరు
జన తెలంగాణ తీరు

ఆత్మబలిదానం ఆపేద్దాం
విధ్వంస ఆవేశాలను నిలిపేద్దాం
సమిష్టి తెలంగాణ సాధిద్దాం

ఇంటి దొంగలను నిలదీస్తే
సెంట్రల్ సర్కార్ దిగిరాదా
స్టేట్ తెలంగాణ ఇచ్చిపోదా

ఇచ్చేదాక ఉద్యమాలు రగులుతుంటె
సంఘటిత జనంతో కదులుతుంటె
స్టేట్ తెలంగాణ సాధింకుంటె

తీవ్రతరం ఉద్యమం
ఉగ్రరూప యువతరం
తెలంగాణ ప్రభంజనం

జై తెలంగాణ
జై జై తెంగాణ
ప్రజా కళలు వర్ధిల్లాలి

కోట్ల గుండెల
అమూల్య ఖజాన
నా తెలంగాణ (నాడు)

వివక్షతాధిక్కార
జీవనసమరం
నా తెలంగాణ (నేడు)

వివక్షతను నిలదీసే మాటలైదాం
తెలంగాణ గుండెల కేకనైదాం
ఆక్రందనల అక్షర వాక్కునైదాం





## వ్యాధి



ముద్ధం భాగ్యరాణి
సెల్ : 9392741031

ట్యాంక్ బాండ్?
ఆంధ్ర బాండ్?
తెలుగు వెలుగులో
తెలంగాణా చీకటేలా?
మా గడ్డమీద
మీ అడ్డా పెట్టి
పల్లి మాదిరి
ప్లాటు కొని
రూట్ మార్చి
రింగ్ రోడ్డు అని
అక్కడ మా భూమే
ఇక్కడ మా భూమే
తల్లి నుండి పిల్లని
వేరుచేసుడే కదా !
నిగ్రహం కోల్పోతే
ఆగ్రహం గ్రహణమైతది
విగ్రహాలైన మనుషులైన
తుత్తునియలు కావా!
ప్రాణాలు పోతే లేని బాధ
మట్టి బొమ్మలకెందుకో
మీ అగచాటుకు
ఇంత అజ్ఞానమా
అబ్బా వలసవాదీ!
వదలదురా నీ వ్యాధి.





## ఉద్యమాల ఊట ఇది
## సిద్ధిపేట చేట మాది



కరెడ్ల రుక్మిణి
సెల్ : 9963149930

నిస్తేజంగా మనముంటే
నిశబ్ధంగా చూస్తుంటే
ఆంధ్రోళ్ళ అహంకారం
అడుగంటే దెప్పుడు?
ఆరవై ఏళ్ళ పోరాటం
సఫలమయ్యేదెప్పుడు?

మావెతలు - మా కథలు
అణచుకొని మేముంటే
హద్దుమీరి పోతుంఁడ్రు
అణచి నలిపి వేస్తుంఁడ్రు

గుండె మీద కుంపటెట్టి
గమ్మున ఊరుకొమ్మంటే
వెఱ్రి వెంగలప్పులమా ?
చేతకాని తుమ్మమూల ?

ఉక్కుపాదం మీరు మోపితె
ఉప్పెనై పొంగుతాము
ఊరు అవతలకి తరుముతాము
సహనాన్నికి హద్దుంటుంది
సమరానికి సమయమొచ్చింది

భగభగమండే గుండెలు
బ్రద్దలయినప్పుడు
లగడపాటి రాయపాటి
ఏపాటి?





ఆరొందల ప్రాణాలు
ఆకాశాన చూస్తొంటే
ప్రతిమకున్న విలువకూడా
ప్రాణానికి లేదంటారా ?

కాళీమాత కన్నోళ్ళం
రుద్రమ్మ చెల్లెండ్లము
కె.సి.ఆర్, కె.టి.ఆర్
అన్న హరీష్ అన్న కొరకు
అసువులైన అర్పిస్తాం
ప్రాణాలు పనంగా పెట్టి
తెలంగాణ ఉద్యమానికి ఊపిరినిస్తాం





# నేనే తెలంగాణ



డా॥ కాపు రమేష్
సెల్ : 9391826154

అంతర్లీన నైరాశ్యం నా సొంతం
నిర్లిప్తత నా నైజం కాదు.
నా మానాన నేనుంటానంటే
నాతో కలిసుంటానంటావ్
లౌకిక మెరిగిన
ఎవరికైనా అర్థం అవుతుంది
అందుకే నాకు.... అనిపిస్తుంది
ఇంకా నాలో ఎంతో మిగిలిందని
అది కూడా పీక్కు తింటానంటావ్
అన్యాయం కదా !
అలస్యంగా కళ్ళు తెరిచాను
ఇంక బుజ్జగించి, భయపెట్టి,
నిద్రపుచ్చడం మానుకో
ఇది ఉద్యమం
తిన్నది, అరిగింది చాలు
ఇంక అజీర్తి దాకా పోవద్దు
పాలకులు సమర్థులా ?
పీడితులు అసమర్థులా ?
ప్రస్తుతం అసందర్భం
సమ-తుల్యం సరిహద్దు దాటొద్దు
నిజాయతిగా దూరం కండి
ఇది సామరస్య ఉద్యమం
నాలో అంతం చూసే సత్తాని
మేల్కొలపకండి
అంతర్లీన నైరాశ్యం నా సొంతం
నిర్లిప్తత నా నైజం కాదు.





# తరుముడే....



మద్దుల బుచ్చిరాజంరెడ్డి
సెల్ : 9393556611

అరవై ఏండ్ల నుండి
నిండాముసిగిన మమ్మల్ని
ఇంకా మబ్బ పెట్టేందుకు
మాయ మాటలు చెప్ప వడ్తిరి...
అన్నదమ్ముళ్ళం
కలిసే ఉందామంటూ
సమైక్యవాదం పేరుతో
ఉరితాళ్ళు పేనవడ్తిరి....
అందరం తెలుగు భాష వాళ్ళమే అంటూ
మాయవల విసర వడ్తిరీ...
అందులోను
అసలైన తెలుగు మాదేనంటూ...
పత్రికలు, పాఠ్యపుస్తకాల నిండా
మీ భాషనే అచ్చువేసుకుంటిరి...
నాలుగు కోట్ల మందిమున్న
మాభాషను నట్టేట్ల ముంచితిరి....
బతుకు దెరువు కోసం
వలస వచ్చిన మీరు
వ్యాపారం కోసం వచ్చిన
ఆంగ్లేయుల మాటలతో
హుశారైన మీరు
వాళ్ళకంటే ఎక్కువనే
మమ్ముల దోయవడ్తిరీ....
పట్నం చుట్టున్న కొండలపై

పొగవేసిన రామోజికి
ల్యాంకో మిద్దెలు, మేడలు కట్టిన లగడపాటికి
టోల్ టాక్సులు వసూలు చేసి కావూరికి
కాంటాక్టులు దక్కించుకున్న రాయపాటికి
తెలంగాణ ఉద్యమం
రాజకీయ గారడిగానే కనిపిస్తుంది....
నాలుగు కోట్ల ప్రజల ఆర్తనాదాలు,
ఆకలి కేకలు అసలే వినపడవు....
కడుపు మండిన తెలంగాణ వీరులు
జీవంలేని విగ్రహాలను ధ్వంసం చేస్తేనే
గుండెలు బాదుకుంటున్న మీరు
ఆత్మగౌరవం కోసం
ఆరువందల మందీ తెలంగాణ
ముద్దు బిడ్డలు ప్రాణం తీసుకున్నా....
కనీసం సానుభూతి పలకరైతిరి....
నల్లదనం, తెల్లదనం
దోచింది, దాచింది చాలదని
సమైక్య నినాదం చేయవట్టిరి....
వద్దు మీ దొంగ స్నేహం మాకొద్దూ
అయిందేదో అయిందీ
మా రాష్ట్రం మాకే కావాలి....
మీ తోవల మీరు పోండ్రీ
లేకుంటే మీ పచ్చనోట్ల కోటాలపై
వాటాలడుగుతాం... వినకుంటే
మిమ్ములను తన్ని తరుముతాం





# కదిలింది తెలంగాణ రథం



- ఎలికట్ట అయిలయ్య
సెల్ : 9440204236

ప॥ కదిలింది కదిలింది తెలంగాణ రథం
కడవిజయం పొందేదాక ఆగదీ పయనం
పాడుతుంది ఆడుతుంది తెలంగాణ జనం
పది జిల్లల గొంతుకలు తెలంగాణ గానం
॥కదిలింది॥

చ॥ 1) ఊరూవాడ కదిలింది ఉప్పెనోలె లేచింది
పల్లెపల్లె కదిలింది పట్నంలో రగిలింది
కర్షక కార్మిక లోకం కదంతొక్కి కదిలింది
యువతరం నవతరం నడుంకట్టి నడుస్తుంది ॥కదిలింది॥

2) విద్యార్థులు మేధావులు మేఘాలై కదిలినం
ఉద్యమాన్ని ఉవ్వెత్తున ముందుకు నడిపిస్తున్నం
పట్టుదలనే పెట్టుబడిగా సాగిపోతున్నం
ఆశయాల సాధనలో ఆగిపోము అంటున్నం ॥కదిలింది॥

3) బీద ధనిక భేదమిడిచి కులమత భేదం మరచి
నాయకులు నారీమణులు నగారా మోగిస్తున్నం
నలువిధాల నిరసనలు ప్రపంచాన చాటినం
ప్రకృతమ్మ ప్రశంసించ ముందుకేగుతున్నం ॥కదిలింది॥

4) నీటివాట నిధుల కొరత తెలంగాణ పై(న)వాత
కళ్ళకు కట్టినట్లు అందరు గమనించునట్లు
నాటి నుండి నేటి వరకు అసమానతల చిట్ట
కాగితాలపై(న) కాసి లెక్కలేసి చూపినం ॥కదిలింది॥

5) నెహ్రూగారి మాటలను యాదికి తెచ్చినం
పెద్దమనుషులొప్పందం ఏమయ్యిందన్నం
ముల్కి నిబంధనలు మంటగల్పినారన్నం
ఆరొందలపది జీవో అమలు సంగతేందన్నం ॥కదిలింది॥

6) భాషలోన యాసమీది ఎక్కిరింపులేందన్నం
పదవులల్ల మీ పెదవుల పైరవీలేందన్నం
మా రేగడి భూములల్ల మీ పా(గ)లేసుడేందన్నం
హైదరాబాదు చుట్టూ(రా) ఆక్రమించుడేందన్నం ॥కదిలింది॥

7) తెలంగాణ పిల్లలంతా పుల్లలోలె మండుతుంటే
మెడకు ఉరితాళ్ళను బిగించుకొని చస్తుంటే
కమిటీల పేరుతో కాలయాపనే వ(ర)ద్దు వ(ర)ద్దు
పార్లమెంటులో బిల్లు ప్రవేశ పెట్టుటే ము(హ)ద్దు ॥కదిలింది॥

8) పార్టీల జెండాలను పక్కకు పె(నె)ట్టేసి
తెలంగాణ ఎజెండాతో ముందుకేగుడు చూసి
పోటెత్తిన జనంతో ట్యాంకుబండు సందడి
జనజాతర పోరులోన సమిధలైన అంగడి ॥కదిలింది॥

9) అక్రమ ఆస్తులకై ఆరాటం మీది
అక్రమ కేసులపై పోరాటం మాది
మా నేలను రణభూమిగా మార్చకండి
మా తెలంగాణ మాదే మీరిడిచి వెళ్లండి ॥కదిలింది॥

10) రానున్న కాలంలో రాజినామా(ల) పర్వం
రాజ్యంగ సంక్షోభం రాకుండా చూడండి
గల్లీనుండి ఢిల్లీదాక దం(డి)డుగా కదిలొస్తం
రావణ కాష్టమై కా(రా)లకుండా చూడండి ॥కదిలింది॥

11) బలగాల బెదిరింపులు మానండి
టియర్ గ్యాస్ వదలడం తీపికబురు కాదు
శాంతి భద్రతల సమస్య(ఆ)నే కాదండి
ర(ప)గులుతున్న తెలంగాణ గుండెల బాధండి ॥కదిలింది॥





12) వెయ్యేండ్లు కలిసున్నా ఏ(వే)రు తప్పదన్నట్లు
నూరేండ్లు బతికున్నా చావుతప్పదన్నట్లు
తెలంగాణ ఇవ్వడం అనివార్యమన్నట్లు
అన్నదమ్ముల్లాగా విడిపోయినట్లు ॥కదిలింది॥

13) అట్టులోని పిండిలాగ అతుకున్నట్లు
అందరం కలిసిపోయి ఆరగించినట్లు
అనందంగానెపుడూ జీవించునట్లు
ఆపదలో అందరం ఆదుకోనున్నట్లు ॥కదిలింది॥

14) హైద్రాబాద్ లేకుండా తెలంగాణ ఊహించం
ఉమ్మడి రాజధాని హైద్రాబాద్ అంటే సహించం
ఇరుపక్షాలు కూర్చుంటేనే చర్చలు స(సు)ఫలం
ఇరుప్రాంతాలుగా విడిపోదామన్నదే మా ధ్యేయం ॥కదిలింది॥

15) పగతో మీరు దగాచేస్తే హద్దులు దాటిస్తం
పాలివానిగా మోసంచేస్తే కనికరమనక పంపిస్తం
పార్టీవాళ్లే తప్పులు చేస్తే తప్పక బయటకు నెట్టేస్తం
పైసలకోసం ఆశపడితే ప్రజలముందుకు లాగేస్తం ॥కదిలింది॥

16) నాలుగుకోట్ల గొంతుకలు పాడుతున్న పాట
నింగిదాక ఆడుతున్న మా తెలంగాణ ఆట
నాలుగు దిక్కులు ఒక్కటైన తెలంగాణ బాట
నలుగురు మెచ్చుకున్న మా(ఆ)వేదన మాట ॥కదిలింది॥

17) పంతాలకు పోకుండా ఆందరమాలోచిద్దాం
పాలకులు తెలుసుకోగ పాలితులను చూద్దాం
పాలన సుభిక్షంగా స్వర్ణయుగం చూపుదాం
ప్రపంచానికే చక్కటి సందేశం పంపుదాం ॥కదిలింది॥

# నడుస్తాం తెలంగాణలో

__ నిమ్మ నర్సింహారెడ్డి జ్ఞాపకార్థం

తెలంగాణ ఉద్యమనేత – తెల్ల వారి పోయినావా – మల్లి జన్మై
మరలి రావన్నా – మాయన్న నీవు తొలిప్రొద్దై మల్లిరావన్నా
నర్సింహారెడ్డన్నా ॥తెలంగాణ॥

కొమ్మ చక్కన రెమ్మ చక్కనా – నీవు నడిచిన బాట చక్కనా –
నీ నోటి మాట చక్కనే నర్సింహారెడ్డన్నా నీవు పట్టిన జెండా చక్కనే
నర్సింహారెడ్డన్నా ॥తెలంగాణ॥

కరీంనగరు జిల్లాలోనా – పల్లెబాట చేపట్టి నీవు – నీవు – ఊరు ఊరు
తిరుగుకుంటు – పల్లె పల్లె తిరుగుకుంటు – తెలంగాణా మనదంటూ
అంతలోనే అంతమయితివి నర్సింహరెడ్డన్న అభిమానుల ఆగము జేస్తివా
నర్సింహరెడ్డన్నా ॥తెలంగాణ॥

తెలంగాణ వచ్చేదాకా – తెల్లవారదు మన బ్రతకాని – చంద్రశేఖరన్న
తోటి చేయి చేయి కలిపినావు – నీ కలలు నిజముచేస్తమే –
నర్సింహరెడ్డన్నా – నీ అడుగు జాడల నడుస్తమే నర్సింహారెడ్డన్నా
॥తెలంగాణ॥

— కొంగర ఎల్లారెడ్డి

పెద్దచీకోడ్, సెల్ : 9848683541







# ఉద్యమాల పేట

కొంగర ఎల్లారెడ్డి

సెల్ : 9848683541

చుట్టూర పది జిల్లాలురన్న – నట్టనడిమిట్లా మన సిద్దిపేటన్నా
అన్నన్న మాయన్నమన సిద్దిపేట – వీరబూసినట్టి గులాబీల తోట
నలుగురు సల్లంగ ఉండాలనుకునే – స్వచ్ఛమైన మనుషులున్న మనపేట
॥చు॥

కవులు గాయకులు కళాకారులున్న – పుట్టుకతో పులకరించిన మనపేట
అడుగేస్తే ఒకసారి వెనుదిరుగనట్టి–కే.సి.ఆర్.ను గన్న బంగారు మట్టి
మట్టిలో మాణిక్యం వెలికి తీయాలి–పట్టిన మన జెండా రుణం తీర్చాలి
॥చు॥

ఉద్యమ పునాదీ మన సిద్దిపేట – గమ్యము చేరుట ఉద్యమ బాట
ఉద్యమ కారుల కోరిక తీరుట – ఉద్యమించుట మనందరి బాట
అందుకూ అందరం ఒక్కటవ్వాలి–ఆశయ సాధన నెరవేర్చాలి
॥చు॥

పెట్టు ఎర్రనీ కుంకుమ బొట్టు – నడుముకు పంచా బిగించి కట్టు
గులాబి జెండా చేతులోపట్టు – పట్టిన పట్టు గట్టిగ పట్టు
తెలంగాణ మనకు రాకుంటే ఒట్టు – అందుకూ అందరం కట్టాలి జట్టు
॥చు॥

# తెలంగాణ లొల్లి ఆగదాయె మళ్ళీ



యన్. నర్సింహ్మరెడ్డి
సెల్ : 9441036589

అరువది తొమ్మిది మొదలు
కాలము శాసించబట్టె ఉద్యమాలు ఎగరబట్టె
విద్యార్థులు ఉరకబట్టిరి ఉద్యోగులు జట్టు కట్టిరి
తెలంగాణ లొల్లి । ఆగదాయె మళ్ళి ।
కమ్మరి కుమ్మరి కలిసె
కులసంఘాలన్ని కలిసె
విద్యార్థులుచ ఉద్యోగులు, కర్షకులు, కార్మికులు
వివిధ సంఘాలన్ని ఏకబిగిన కలిసె
అమరుల త్యాగానికి అంతమెప్పుడనిరి
తెలంగాణ లొల్లి । ఆగదాయె మళ్ళి ।
తెలంగాణ తెస్తమంటు ఒకరంటే
వ్యతిరేకం మేముకాదని మరొకరంటే
మీ బిల్లుకు మామద్దతు అని మరొకరంటే
ఐక్యమత్యమవుదామని అందరం అంటుంటే
పదవి పాడుగాను పంచాయతి పెట్టవట్టె
తెలంగాణ లొల్లి । ఆగదాయె మళ్ళి ।
మన వెతలు, మన బాధలు
కానరావాయే సీమాంధ్రులకు
తెలంగాణంలోని వాడే తెలంగాణకు వ్యతిరేకమైతె
ప్రజలమనసెరగని నీతిలేని నాయకులు అడ్డమైతే
తెలంగాణ లొల్లి । ఆగదాయె మళ్ళి ।
వీరుల త్యాగాల విల్లంబులు బూని
నాలుగుకోట్ల ప్రజలంతా ఏకమై
నా తెలంగాణ జన్మ హక్కుఅని
ఊరువాడ కలిసి కదిలి జట్టుకడితె
తెలంగాణకు జయం । జనమంతా జయం ।





# తెలంగాణ పోరడు



కాల్వ వేణుగోపాల్
సెల్ : 9701750863

మాది తెలంగాణ మాకు కావాలె,
మాయి కలలు నిజం కావాలె;
ఆంధ్రోని పెత్తనం ఖతం కావాలె,
తెలంగాణోడే తన సొత్తుకు పత్తా కావాలె;
మాకు నదినీళ్ళల్ల పక్కా వాటా దక్కాలె,
మా ఉద్యోగాలన్నీ సక్కగ మాకె చిక్కాలె ;
మా తెలంగాణ యాస అధికార భాష కావాలె
మా తెలంగాణ జానపదం సుసంపన్నం కావాలె;
మా చార్మినార్ అందాలు మాకే అందాలె,
మా రామప్ప శిల్ప అద్భుతాలు మాకే చెందాలె ;
మా బతుకమ్మ ఆటలు మాకే కావలె,
మా పీరీల ఊరేగింపులు మాకే కావాలె;
మా కాళోజీ గేయాలు మాకే కావాలె,
మా కాపు రాజయ్య చిత్రాలు మాకే కావాలె;
మా దమ్‌కా బిర్యాని కమ్మదనం మాకే కావాలె,
మా రాగి సంగటి చల్లదనం మాకు కావాలె;
ఇట్ల గాక....
రక్త సిక్తమైన.... అస్తవ్యస్తమైనా....
మా తెలంగాణ పోరడు ఊకోడు
శతఘ్ను జ్వాలలా.... మృత్యు హేలగా మారి
పాశుపతాస్త్రంలా.... పాపనాశాస్త్రంలా...
తెలంగాణ ద్రోహుల గుండెల్లో దూరి ... చీల్చి చెండాడ్తడు
సరికొత్త తెలంగాణ సాధిత్తడు
సరిలేరు నాకెవ్వరని నిరూపిత్తడు

# పోరాటం



మిట్టపల్లి మహేశ్ గౌడ్
సెల్ : 9959003195

ఇది పోరాటం.... ఆకలి పోరాటం
నాలుగు కోట్ల ప్రజల ఆరాటం...
తెలంగాణ బ్రతుకు పోరాటం
హింస మాదికాదు-అహింస ఆయుధం కాదు
బ్రతుకు మాది కాదు
భవిష్యత్ మా పిల్లలకి కావాలి
అంగట్లో సోనియా - ఆంధ్రా లాబీంగ్
కాకా కసుర్లు - తెలంగాణ రాష్ట్రానికి ముసుర్లు
ఇస్తామన్న కాంగ్రేసు
ఆగేదిలేదన్న కే.సి.ఆర్.
ఉట్టిదేనన్న ఆంధ్రాబాబు
పోరాడి తెచ్చుకుంటామన్న గద్దరన్న
కదం కదం కలుపుతూ
పదం పదం పాడుతూ
యుద్ధభూమిని తలపించిన తెలంగాణ
అమరవీరుల సాక్షిగా ఆయుధంబు లేకుండా
ఆశయ సాధనే ధ్యేయంగా
ఆత్మబలిదానాలు వద్దంటూ
అమరవీరుల త్యాగాలను కీర్తించుకుంటు
బడుగుల చేతనం - భాగ్యరేఖగా
సాధించుకుందాం తెలంగాణ రాష్ట్రాన్ని
స్వర్ణయుగంగా మార్చుకుందాం తెలంగాణాన్ని
జై తెలంగాణ... జై జై తెలంగాణ





# తెలంగాణ



కనపర్తి
రామచంద్రాచార్యులు
సెల్ : 9963256419

ఇది నా తెలంగాణ
తెలుగు మారాణి తెలంగాణ
తెలుగు పూలు పూసి (తెలుగు దేశమంతా) తెలంగాణ
గుభాలింపచేసి
తెలుగు పేరును నలుమూలల
తెలుగు కీర్తిని పెంచింది తెలంగాణ
ఇది నా తెలంగాణ
కోటి రతనాల వీణ
కోటి సుగుణాల జాణ

⌘ ⌘ ⌘

# తథ్యము నమ్ము



అష్టకాల
నరసింహరామశర్మ
సెల్ : 9440009963

కII వచ్చెను స్వాతంత్ర్యమ్మని
ముచ్చులు నౌ తెల్లవారు పోయిరనుచు, వి
వ్వచ్చులుగ భారతీయులు
మెచ్చుగ సుఖశాంతు లొప్పి మెలగుదు మనుచున్

తే.గీ. భాష-సంస్కృతి యనుపేర ప్రజలు క్రొత్త
రాష్ట్రముల నేర్పరుచుకొని ప్రబల సుఖము
లందునని యెంచె గేంద్రమా ఆంధ్రదేశ
మొక్కటయ్యెను అందులో నొకటిగాగ

తే.గీ. ఆంగిలేయుల యన్యాయ మదియటుండ
తెలుగు వారిలో పక్షపాతులక తాన
మా తెలంగాణ ఆంధ్ర సీమలకు మధ్య
తెగులు పుట్టెను విడిపోవు దృష్టి కలిగె

తే.గీ. అన్నచేసిన యట్టి యన్యాయ మెరిగి
నాయకుల బలహీనత, నైజమెంచి
తరలి విద్యార్థు లాత్మహత్యలకు దిగుచు
చేయు పోరాట ముధ్ధృత మాయె నిపుడు





తే.గీ. మాటఇచ్చిన సోనియా మాటనమ్మి
ఆంధ్రవాదుల దుర్మార్గ మరసి చూసి
బొప్పికట్టిన నెత్తితో పొగిలి పొగిలి
దేనికైనను దెగియించె తెలుగువాడు

తే.గీ. నా తెలంగాణ కోటిరత్నాల వీణ
యనుచు నైజాము రాజును హడలజేయు
దాశరథి యొక్క విస్ఫూర్తి ధైర్యమీయ
తెలుగు తమ్ములు పట్టుతో దిగిరి పోర

తే.గీ. చదువు రానట్టి వారితో చదువుకున్న
వారు నుద్యోగు లడ్వకేట్వర్గమంత
తరలి మా తెలంగాణ సాధనము కొఱకు
ప్రాణములనైన నిచ్చి పోరాడ దలచె

తే.గీ. డబ్బుతో కార్యసాధనాడంబరమున
ఆంధ్రనాయకు లెల్ల సమైక్యమనుచు
కొత్తవాదము తెచ్చిరి కుటిలనీతి
అసలు పోరాట ముధ్ధృతమైనకొలది

తే.గీ. కుటిల వాదముతో నాయకులు స్వలాభ
సాధనముతోడ నుద్యమ సఫలతకును
వారి వారి మార్గాల వివాద పడగ
ఆచితూచుచు కేంద్రము ఆలసించు

కII మునుపటి జాగీర్దారులు
ఘనతవహించిన దొరల యఘం బిదియే కా
మనవృద్ధి మంటగలిపెను
కనగా నిక ఏబదేండ్లు కష్టాలబడెన్

కII భూస్వాములతో నొకచో
సస్వార్థుల రాజకీయ చాతుర్యముతో
నస్వాభావిక క్షమ స
ర్వస్వము తెలగాణ కోలుపడె నిరతంబున్

కII అరవై తొమ్మిది ఉద్యమ
పరులను పల్చగ నొనర్చి బ్రతికిరి నేతల్
కరువై బరువై జీవన
భరమున తెగియించి పోర వలసెను నేడున్

కII తప్పక పంపకములతో
తప్పని తమరాజకీయ తంత్రమ్ములతో
నిప్పుడు రానిచో మనకిక
తప్పదు బానిసతనంబు తథ్యము గాగన్

మII ఇక ఈ పోరు ఫలించ నాయకులదే యీపాప మట్లైన త
ప్పక విద్యార్థులు యౌవనుల్ సకలమున్ ప్రాణాల నర్పించి యిం
చుక లాభంబది యేమి, నాడు జడిసెన్ సుమ్మాంధ్ర లోకంబు నే
డిక నే చీమల బోలి నల్చెదరు సుమ్మీ! యీ తెలంగాణమున్





తే.గీ. అన్నదమ్ముల వలె విడి యున్న మేలు
శత్రువులుగా దలంచిన శాశ్వతమున
పాకు భారత జాతిగా ప్రబలవలయు
ఇది యెరుంగుడు భవితలో నిదియె జరుగు

కII హిందీకి నిన్ని రాష్ట్రము
లందముగా నుండ తెలుగులందున రెండై
పొందుగ నుండగ జాలమె ?
కొందరి స్వార్థమ్మె పెరిగి కొందల మందన్

— అష్టకాల నరసింహరామశర్మ
సెల్ : 9440009963

# పోరు బాట



సామ సువర్ణాదేవి
సెల్ : 9849182277

తెలంగాణ తల్లి ముద్దు బిడ్డలు
నాలుగు కోట్ల మంది
ఆంధ్ర వలస పాలకులను
అవతలికెల్ల గొట్టెతందుకు
పది జిల్లాల ప్రజానీకం
పల్లె పట్నం తేడాల్లేక
ఉన్నోళ్లు, లేనోళ్లు
ఆడోళ్లు - మొగోళ్లు
విద్యార్థులు, ఉద్యోగులు
మేధావులు, కార్మికులు, కర్షకులు,
రాజకీయనాయకులు, అందరం ఒక్కటైనం
ఆగదింక మా పోరు... మా భాష, యాస
బాగ లేదన్నోళ్లతోటి మాకేం పొత్తు...? ఆంధ్రావాళ్ళతో పొత్తు
'థూ' అంటున్నరంత. మా పండుగలు, పబ్బాలు
నచ్చనోళ్లతోటి నడకేంది మాకు...
కలిసుండి మేం సాధించుకున్నదేంది...
కష్టాలు, కన్నీళ్ళు దుప్ప, అందుకే...
కలిసుండుడు కుదురదు
కదలాలె ఆంధ్రోళ్ళు మరి ఖబర్దార్





మాది వీర తెలంగాణ,
ధీర తెలంగాణ
ఆత్మగల్ల తెలంగాణ,
కపటాలు, మోసాలు, దోపిడీలు దెల్వవు...
కాని పిరికోల్లంగాదు
స్వరాష్ట్ర సాధనలో అమరులైన
వీర తెలంగాణ రాష్ట్రాన్ని
మనం సాధించుకుందాం
ఈ సాధనలో ఎవ్వల మాట వినేది లేదు
ఏ కమిటీలు ఏం న్యాయం జేసింద్రని
గల్లీ నుండి ఢిల్లీదాకా
మన మాట, పాట ఒక్కటే కావాలె మనందరి బాట
పోరు బాట గావాలె

— సామ సువర్ణాదేవి
సెల్ : 9849182277

# చేతనకు తరలిరండి



వి. శైలజ
సెల్ : 9441544806

తలవాకిట గోదావరి తలపులలో కృష్ణమ్మ
అణువణువున జీవనదుల నింపుకుని
తేజస్సును వెదజల్లే తెలంగాణ వీరులకు
కన్నీరే వరదలాయె కడగళ్ళే పంటలాయె
గొంతు తడుపుకొనగ చుక్క నీరు కానరాకపాయె
ఆడి ఆడి నెమలి భామ అలసి సొలసి పోయె
సేదదీర తరువు లేక చిన్నబోయి చూచె
పాడి పాడి కోకిలమ్మ గొంతు మూగబోయె
మావి చిగురు మేత లేక వెలవెలబోయె
తెలంగాణ మట్టి తెగువ, తెలంగాణ గాలి బిగువు
నరనరాన నాట్యమాడు తెలంగాణ యోధులార
శూరత్వం, ధీరత్వం, కలగలిసిన వీరత్వం
గుండె నిండ నింపుకున్న తెలంగాణ బిడ్డలార
గరికలన్నీ ఒక్కటిగా కరిని కట్టివేసినట్టు
రేణువులన్నీ కలిసి మేరునగమై ఎగిసినట్టు
బొట్టు బొట్టు నీరు కలసి వాగులై పారినట్టు
పిల్లగాలులన్ని కలిసి సుడిగాలై తరిమినట్టు
ప్రతి అడుగు కలగలిసి పయనం సాగించాలి
ఎద ఎదను తట్టిలేసి కదలిక సాధించాలి
మన స్వేదం, మన రుధిరం తెలంగాణ తల్లి రుణం
తీర్చుకొనగ సాగుదాం
స్వరాష్ట్ర సాధర కోసం అహర్నిశలు శ్రమియించే
సమయం ఆసన్నమాయె తరలిరండి తరలిరండి
కలసి ముందుకేగుదాం, కలసి ముందుకేగుదాం





# సాధించుకుందాం



శ్రీహితారెడ్డి
సెల్ : 9849182277

నాలుగు కోట్ల అన్నదమ్ములు అక్కచెల్లెల్లు
తాగు నీరు లేక సాగు నీరు లేక
పంటలు లేక ఫలాలు లేక తల్లడిల్లుతుండ్రు
పొలాలన్ని బీల్లుగా మారవట్టె
చదువుకు తగిన కొలువులు లేక గరీబులైతుండ్రు
ఇవన్ని బాధలు పోవాలంటే
మన తెలంగాణ మనకు రావాలే
మన తెలంగాణ మనకు వచ్చినంక
మన బతుకులు బాగుపడతాయి
బోనాలు, తీర్థాలు, జాతరలు చేసుకుందాం
మన తెలంగాణ కోటి రతనాల వీణ
పది జిల్లాల ప్రజలమొకటై కోట్లాదిగా
మన తెలంగాణ మనం సాధించుకుందాం
జై తెలంగాణ - జైజై తెలంగాణ

# కడుపు కోత



పి. యాదగిరి
సెల్ : 9347239520

బిడ్డా...
నీ పానం దీస్కున్నవ్ తెలంగానొస్తదా...
కొడుకా...
తెలంగానొస్తె నువ్వు మల్ల కండ్లబడ్తవా...
కాసు మరిగిన రాకాసులకు
నీ పానం ఏపాటిది తండ్రీ
రంకు నేర్చినోడు బొచ్చె ఇరుసుక తిరుగవట్టె
కడుపు మండినోడు కాలిసావవట్టె

బిడ్డా...
నీ పానం దీస్కున్నవ్ తెలంగానొస్తదా...
కొడుకా...
తెలంగానొస్తె నువ్వు మల్ల కండ్లబడ్తవా...
గోరెచ్చని లీల్లు తాక్తెనే... తల్లడిల్లెటోనివి
అగ్గితోని తానం ఎట్లజేసినవ్ బిడ్డా
పేగుబంధమని పేగుమాడ్సుకొని పెంచుకొన్న
ఈ తీగబంధం తెంపుకొని నాకడ్పు కాల్సినవా నాయిన
దిక్కు దిక్కున పిల్సుకుంట
ఎక్కి ఎక్కి ఏడ్సిన బిడ్డా
నా కన్నులల్ల లీల్లు రాలేదురా
నా సన్నులల్ల పాలూరినయి కొడకా...





బిడ్డా...
నీ పానం దీస్కున్నవ్ తెలంగానొస్తదా...
కొడుకా...
తెలంగానొస్తె నువ్వు మల్ల కండ్లబడ్తవా...
మూలసుక్కల కనబడ్తవా నాయిన
పొద్దు పొడుపుల కనబడ్తవా తండ్రి
ఎన్నీలల కబడ్తవా నా బంగారమూ
తోకసుక్కవై వత్తవా నా కన్నయ్య
ఆకరికి నా కాష్టంల అగ్గివైయన్న కనవడు
నువ్వు తింటెనే నా కడుపు నిండేది బిడ్డా
ఇగ నాకన్ను మూతవడితెనే నా మడుసు నిండుతదిరా...

నా పాడె ముందల మారాజోలె నడ్తవనుకున్న
జాడలేకుంట యాడబోయినవురా నావెండి

తెలంగానల కొట్లాటలు కొత్తగాదు
నెత్తురు వాసన కొత్తగాదు
నువ్వు పుట్టంగనే నానెత్తురుతోనే
నీ పెయ్యిగడిగిన బిడ్డా...
మీ తాతలు నెత్తురు మోటలు కొట్టిండ్లు
పోరు పంటలే పండించిండ్లు
తుపానుకు జోరు మన పోరే నేర్పింది
లీల్లకాల్వకు రువ్వడి నెత్తుటి కాల్వే నేర్పింది

బిడ్డా...
నీ పానం దీస్కున్నవ్ తెలంగాణొస్తదా...
కొడుకా...
తెలంగాణొస్తె నువ్వు మల్ల కండ్లబడ్తవా...
సంపుడుదెల్సు, సచ్చుడు దెల్సు
బందూకుల గుండ్లు బుక్కకొక్కటి
గుటుక్కున మింగుడుదెల్సు
ఉరి శిక్షలతో ఉయ్యాలూగుడుదెల్సు
పానం దీస్కునుడు మాత్రం దెల్వదిరా
బద్మాషీ...
నువ్వు ఈరుడవెట్లైతవ్
నేను ఈరమాతనెట్లయిత కొడకా...
ఉర్ములకు గాండ్రిచ్చుడు నేర్పింది
మన తెలంగాణ
మబ్బులకు కత్తిసాము నేర్పి
ఆ కత్తులల్ల మెరుపులు పుట్టించింది
మన తెలంగాణ
పిడుగులకు అగ్గిరాజేసింది
మన తెలంగాణ
సింహాలకు పురుడు పోసింది
మన తెలంగాణ
పానాలు దీస్కునుడు మాత్రం
చెయ్యలేదు మన తెలంగాణ

బిడ్డలారా కొడ్కులారా
పానాలతో తెలంగాణ సాధించుకుందాం
శవాలతో మాత్రం కాదూ....







# ఉస్మానియా పొద్దు



సిద్దెంకి యాదగిరి
సెల్ : 9441244773

వందేమాతర వందనమై
రజాకార్ల నెదురించిన నిప్పురవ్వలు
కులాలకూ మతాలకూ అతీతమై
కుట్రలపై పెట్రేగే చైతన్యపు సైరనలయి
నాలుగుకోట్ల ప్రజలకు ఊపిరిలూదుతూ
ఊసిల్ల పుట్టగా ఎగసిపడే విద్యార్థిలోకం
క్షణమొకయుగమై పురిటినొప్పుల ఆపతిపడుతూ
ఉద్యమాలకు పొద్దుగోసే పచ్చిబాలింత
బతుకంతా గాయాల బర్రెలై
నిలువెల్ల వీరతెలంగాణ పోరుబాటై
నిరసిస్తూ నిద్రలేపే ఉస్మానియా...!
పదవుల త్యాగానికి హారతిపడ్తూ
జై తెలంగాణ నినాదాల హోరులో
శాసనసభ్యులకు మద్దతు ర్యాలీ
హద్దులు దాటిన రాజ్యహింస
హెచ్చరికలు లేకుండానే గాల్లో కాల్పులు
భాష్పవాయువు ప్రయోగాలు
రబ్బరు బుల్లెట్ల దెబ్బలు

ఎగురున్న లాఠీలకు, కోరస్ కలుపుతున్న
ఇనుపబూట్ల చప్పుడు
ఎదురుతిరిగిన విద్యార్థి పిడికిళ్ళు
నెత్తులు పలగ్గొట్టిన పోలీసురాళ్లు
వాతలుదేలి బొడుసొచ్చి ఇరిగిన బొక్కలు
పగపట్టి జడలువట్టి తన్నులు దెబ్బలు గుద్దుల్తో...
విద్యార్థినులపై మొగఖాకీల వీరంగం
కండ్లల్ల మెరుస్తున్న మీడియాలో
ఆర్థనాదాలు తెలంగాణ గుండెల్లో ముండ్లైగుచ్చుతుంటే
ఆత్మార్పణమైన పాణాలు
సూసైడ్ నోట్‌లయి మీడియాలో కనబడుతూ...
సీమాంధ్రా అధికారమా....?
అంకశ్రేఢిలో మమ్ముల అణచేస్తే
గుణశ్రేడిలో రెట్టింపయ్
పరాయి పాలనను పేగులెల్ల పొడిచేస్తయ్
ఆంధ్ర జులం మీద ఉస్మానియపొద్దు ఉదయిస్తది

— సిద్దెంకి యాదగిరి
సెల్ : 9441244773





# తెలంగాణ నా జన్మహక్కు



గడీల బైరవరెడ్డి
సెల్ : 8106272163

నా తెలంగాణ కోటి రతనాల వీణా
సిరిసంపదలతో తులదూగే
తెలంగాణా పై కన్నేసి
ఆంగ్లేయుల్లా వలస వాదివై వచ్చి
మా నీళ్ళు, మా నిధులు, ఉద్యోగాలు
కాళ యముడిలా కబళించి వేసావు
అడుక్కుతినేవాడికి అహంకారమెక్కువ
అధికారముతో అందలమెక్కి
కండకావరముతో కదంత్రొక్కుతున్నావు
మణులడుగలేదు మేము మాన్యాలడగలేదు
మా తెలంగాణ మాకివ్వు మంటే
ముప్పుతిప్పలు పెట్టి మాణిక్యాలాంటి
తెలంగాణ పోరుల ప్రాణాలతో
చెలగాట మాడుతున్నావు
ఓ ఆంధ్రుడా దుర్మదాంధ్రుడా
మా నాల్గుకోట్ల తెలంగాణ ప్రజల
ఉసురు తగలి శ్రీఖర నామ సం॥రంలో
కాలగర్భములో కలసిపోతావు
ఇది సత్యం ఇది అక్షర సత్యం
నాటి నుండి నేటి వరకు తెలంగాణ వాదిని
తెలంగాణ నా జన్మహక్కు
జై తెలంగాణ - జై జై తెలంగాణ

# రాజీనామ (పేరడీ పాట)



వంగ అవంతికా రెడ్డి
సెల్ : 9391813526

చెయ్యి చెయ్యి పదవికి - న్యాయమన్నచెయ్యి
చెయ్యలేక పోతెనువ్వు - రాజీనామా చెయ్యి
ఏది చెయ్యకుండ నువ్వు - సాకులెన్నో చెప్పకు
తెలంగాణ ప్రజల - పరువు నువ్వు తియ్యకు ॥చె॥

ఆశలెన్నొ చెప్పినావు - అందకుండపోయినావు
అవసరాని కందకుండ - దొంగతోని సోపతేంది
చూరు ఎక్కికూసుడేంది - చుప్పనాతి మాటలేంది
కుర్చివదలకుండ - కుండచాటుకుండుడేంది ॥చె॥

చుక్క తెగిపడ్డట్లు - ఎప్పుడైన వస్తే
వందిమాగదులతో - సందులేని ముచ్చట్లు
ముచ్చట సంబూరాన - మగని మరచినట్లు
కప్పదాటు మాటలతో - కాలమెల్లదీసుడాయె ॥చె॥

వినతి పత్రమందిస్తే - వింతగా చూస్తావు
చదువనైన చదువవు - చెప్పింది విను
చెవిటివాని ముందు - శంఖమూదినట్లు
సొల్లు మాటలెన్నో చెప్పి - జెల్లకొట్టుడాయె ॥చె॥





దివానోలె నువ్వు - డిల్లి చుట్టు తిరుగకు
తెలంగాణ పేదప్రజల బతుకాగం జెయ్యకు
సమైక్యాంధ్ర వాదులతో - చెయ్యి కలిపి తిరగకు
పిల్లకాయ చేష్టలతో - పిల్లిపాలు తాగకు ॥చె॥

పదవికోరి నీకు నీవె - పోటిచేసినావు
తెలంగాణ తెస్తనని - ఓట్లు గుంజినావు
తెచ్చెదమ్ము లేనప్పుడు - నీకు పదవి ఎందుకు
రాజీనామ పత్రము ఇవ్వటమే న్యాయము

— వంగ అవంతికా రెడ్డి
సెల్ : 9391813526

